# లక్ష్యము

# కర్తవ్యము



పరమ పూజనీయ శ్రీ గురూజీ

# ప్రస్తావన

1972 నవంబరు మాసములో బొంబాయి సమీప మండలి ఠానా నగరంలో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ యావద్దేశీయ ప్రముఖ కార్యకర్తల శిబిరం జరిగింది.

శిబిరంలో సరసంఘచాలక్ పరమ పూజనీయ శ్రీ గురూజీ గోల్వాల్కర్ సమాజ సంఘటనా లక్ష్యమును వివరించి కర్తవ్య ప్రబోధం చేశారు. జాతీయ పునర్నిర్మాణ కార్యములో అత్యంత ప్రాముఖ్యము గల వారి ప్రసంగముల లోని కొన్ని భాగాలను ఈ గ్రంథరూపంలో అందిస్తున్నాం.

# మనం హిందువులం

ఈ రాష్ట్రం మనది. ఇది హిందూరాష్ట్రం. ఈరాష్ట్ర జీవనాన్ని పరమ శక్తివంతంగా తీర్చిదిద్ది, దీని గొప్పదనాన్ని తిరిగి నెలకొల్పాలని మనం కోరుతున్నాం. దీనికోసం ప్రయత్నిస్తున్నాం. దీన్ని సాధించేవరకు ఈప్రయత్నం సాగుతూనే ఉంటుంది. హిందూభావాలు లేనివారు ప్రపంచంలో కొందరు ఉన్నారు. మన సమాజంలో కూడా ఉన్నారు. అలాంటి వాళ్ళు హిందూత్వాన్ని వక్రంగా విమర్శిస్తుంటారు. విమర్శించనీయండి. నష్టంలేదు. ఈ యదార్థ తత్వంమీద మనకు చలించని నిష్ఠ ఉంటే, మన ఆత్మవిశ్వాసంవల్ల హిందూ సమాజంలో ఎక్కువభాగం ప్రభావితులవుతారని నా నమ్మకం.

'హిందు'ను గురించి భ్రాంతి కల్గచేయడానికి రకరకాల ప్రయత్నాలు సాగుతున్నాయి. అనేక స్వార్థాలకు లోబడి, అనేకరంగాలలో, హిందు అంటే ముస్లిం వ్యతిరేకి అనీ, క్రైస్తవ వ్యతిరేకి అనీ. క్రమేపీ సిక్కులకు, జైనులకు, హరిజనులకు వ్యతిరేకి అని ప్రచారం చేస్తున్నారు. అలా ప్రచారం చేసేవాళ్ళకు, వారివారి రాజకీయాది స్వార్థాలున్నాయి. కనుక అంటున్నారు. ధర్మాన్ని, సంస్కృతిని, చరిత్రను చదివి అనడం కాదు. హిందూ ఆలోచనాపద్ధతి, జీవనవిధానం, ప్రపంచంలో ఇస్లాం క్రైస్తవ మతాలు పుట్టక పూర్వంనుండే మనదేశంలో ఉన్నాయి మరి హిందు అంటే ముస్లిం వ్యతిరేకి అవడమేమిటి? అలాగే సిక్కు జైన

మార్గాలు హిందూత్వంలోనివే. హిందు సిక్కు జైనులకు వ్యతిరేక మను కోవడం మన చేజేతులా మనకాళ్ళను నరుక్కోవడమే. హిందూ వీటికి వ్యతిరేకమెలా అవుతుంది? ఇవన్నీ అల్పబుద్ధులలోంచి పుట్టే విమర్శలు. ఈవిమర్శల్లో నిజంలేదు హిందు ఎవరికీ వ్యతిరేకి కాదు. ఇది పూర్తిగా భావాత్మకం – వ్యతిరేకాత్మకం కాదు.

ఇలాంటి పాతవైన, బూజుపట్టిన ఆరోపణలే హిందూత్వాన్ని గురించి కొందరు చేస్తుంటారు. వీటికి మన సమాజంలో కొందరు భయ పడుతుంటారు. ఈరాష్ట్ర జీవనాన్ని మరోపేరుతో వ్యవహరిద్దామంటారు. పేరు మారితే మూలమైన అర్థం ఎక్కడికి పోతుంది? 'ఆర్య' అని వ్యవహరిస్తే మంచిదంటారు మన ఆర్యసమాజ సోదరులు. ఆర్య అన్నా అదే అర్థం స్ఫురిస్తుందికదా! కొందరు భారతీయ అనమంటారు భారత్ అనేపదాన్ని ఎన్నివిధాల త్రిప్పి చెప్పినా వేరే అర్థం స్ఫురించదు. స్ఫురించేదల్లా హిందూత్వమే. మరి, అనుమానం లేకుండా హిందూ అనే పదాన్నే ఎందుకు వాడకూడదు? హిందూశబ్దం చక్కగా వాడుకలో ఉన్నది. ఈశబ్దం అన్నింటినీ తనలో ఇముడ్చుకున్నది. మన రాష్ట్రాన్ని అన్నివిధాలా అభివృద్ధి చేయదలచుకుంటే, హిందూధర్మం, హిందూ సంస్కృతి, హిందూ సమాజాలను సంరక్షిస్తేనే సాధ్యమవుతుంది అది జరగనినాడు రాష్ట్రం అనేదాంట్లో మరేమీ మిగలదు – రెండుకాళ్ళ జీవాలు తప్ప. రాష్ట్రమని అనగానే ఈదేశంలో హిందూత్వమూలమైన ఒక విశేష మరోలక్షణం గల సమష్టి రూపము కనబడుతుంది కనుక ఈ విషయంలో మనకు గట్టి పట్టుదల ఉండాలి. దీనిలో మనకే అనుమానం ఉంటే మనమాటల్లో బలం స్ఫురించదు. అలాంటి మాటలకు ఆకర్షింపబడే వాళ్ళు కూడా ఉండరు. కనుక నిస్సందేహంగా "మనం హిందువులం; ఈ ధర్మం, ఈ సంస్కృతి, ఈ సమాజం మనవి. వీటివల్లనే మన యీ రాష్ట్రం ఏర్పడ్డది" అని ప్రకటించాలి. మనకీజన్మ భవ్యము, దివ్యము,

స్వతంత్రము, సమర్థమునయిన జీవనాన్ని నిర్మించడానికే లభించిందని ప్రబలంగా మనం విశ్వసించాలి. ఈ విశ్వాసబలంతో, అనేకులలో ప్రేరణ కల్గించాలి ఈ ప్రచారం చేసేటందుకు ఎట్టి భయసంకోచాలు పడనక్కర లేదు.

## సర్వవ్యాపకమైన కార్యం

ఈ తత్వాన్ని మూలంగా గ్రహించి మనం సంఘ కార్యం చేస్తున్నాం. మన సమాజ జీవనంలోని ప్రతిరంగమూ ఈ తత్వంనుంచి ప్రేరణ పొందాలని మన ఆశయం అంటే 'సంఘ' రూపంలో ప్రతి పనిలో మనం వేలు పెడతామనా! ప్రతిరంగంలో సంఘమే హడావిడి చేస్తుండాలా? ప్రతిదీ సంఘమే చేయాలా? ఇంతవరకూ మనం అలా అనుకోలేదు. రాష్ట్ర జీవనం అంటే అనేక రంగాలుంటాయి. అన్నిచోట్ల పని జరగాల్సిందే ఆయారంగాలలో పనిచేస్తున్న కార్యకర్తలిలా పని చేస్తూనే ఉండాలి. మనం చెప్పేదల్లా తత్వాన్ని గ్రహించి, దాని ప్రకారం చేయండని మాత్రమే. రాష్ట్ర జీవనంలో ప్రతిరంగంలో ఇలా వ్యక్తులు ముందుకు వెళుతూనే ఉండాలి. రాష్ట్ర ప్రగతిని గురించి ఆలోచించాలి. రాష్ట్రం అన్నివిధాల బాగుపడేందుకు పనిచేయాలి.

సంఘం పని సర్వవ్యాపకం. సర్వవ్యాపకమంటే ఏరూపంలో? ఉదాహరణకు వెలుతురూ సర్వవ్యాపకమే. కాని వెలుతురే ప్రతిపనీ చేయదు. చీకటిని తొలగించడం, దారిచూపడం దానిపని. ఈ నిజాన్ని గ్రహిస్తే గందరగోళం ఎక్కడా కన్పించదు గ్రహించనిరోజున గందర గోళం తప్పదు ప్రతిచోటా మనమే వేలుపెట్టాలనుకుంటే, ప్రతిక్షేత్రాన్ని గురించి ఒక్కొక్క థీసిస్ వ్రాయాల్సివస్తుంది. అప్పుడు సంఘటన రూపంలో, మౌలికంగా సర్వత్రా నడుస్తూన్న మన కార్యం ఆగిపోతుంది.

మిగిలేదల్లా ఫీసిస్ ఒక్కటే. కనుకనే 'రాష్ట్ర జీవనానికి ఇదే వ్యాపకరూప మనీ, ఈ సిద్ధాంతాన్ని అనుసరించే ప్రతిపని నిర్మాణం కావాలనీ మనం ప్రతిపాదిస్తున్నాం. ఈ తత్వాన్ని తప్పినట్లు ఎక్కడైనా కన్పిస్తే, సంఘ కార్యకర్తలు, తమ విధిగా భావించి హెచ్చరించాలి. పట్టుదలతో మన తత్వాన్ని ప్రతిపాదించాలి. ఉల్లంఘన మాత్రం జరుగకూడదు అంతేగాని, ఆయారంగాలలో పనిచేసే వ్యక్తులకు సిద్ధాన్తం అందచేయడం మన పని కాదు. తత్వాన్ని పట్టుదలతో అనుసరిస్తూ, దాన్ని నిత్య వ్యవహారంలోకి తీసుకునివచ్చే విషయంలో ఆయారంగాలలో ఉన్న కార్యకర్తలే ఆలో చించాలి. పద్ధతికూడా అదే.

## మాటలకూ చేతలకూ తేడా

అయినా మన సమాజానికి మాత్రం సిద్ధాన్తంలేదా? ఉన్నది. చెప్పాలంటే మనకు కొరతఅంటూలేదు. పూర్వపు సంగతొకటి స్మరణకు వస్తున్నది. ఒక పెద్దపట్టణంలో పెద్దల సమావేశం జరిగింది ఒక ప్రఖ్యాత నాయకుడుకూడా వచ్చాడు. ప్రస్తుతం ఆయన గతించారు. సమావేశంలో సంభాషణ సందర్భంగా "హిందూతత్వం గొప్పదే. కాని నేడు అది ఆచరణలో కన్పించదు. సర్వేభవంతు సుఖినః, సర్వేసంతు నిరామయః– అందరూ సుఖించాలి. అందరూ ఆరోగ్యంగా ఉండాలి – అని రోజూ ప్రార్థిస్తాం. కాని ప్రయత్నం చేయం. అలాగే దేవుడిచ్చినదాన్ని మన చుట్టూ ఉన్న మనుషులకూ, ప్రాణులకూ పంచగా మిగిలినదాన్నే అనుభ వించాలని, అలా చేయనివాళ్ళు పాపాన్ని తిన్నట్టు అని అంటాం. కాని అలా వ్యవహరించరు. ఇలాంటి ఉదాత్తమైన ఆశయాలున్నా, ఆచరణలో ఈ సమాజంలోనే ఒక వర్గాన్ని అంటరానివారంటూ దూరంచేస్తాం. మాటవరుసకు మనమంతా ఒకే పరమేశ్వరుని స్వరూపులమంటాం కాని ఆచరణలో అదేమీ కన్పించదు'' అని ఆయన అన్నారు.

ఆ పెద్దమనిషి అన్నది నిజం. అతనిమాటను ఆమోదించి 'నిజమే కడుపు నిండడానికి ఎంత అవసరమో అంతే మనది. మిగిలింది మనది కాదు. ఆ మిగిలినదాన్ని మన దనుకోడం దొంగతనం. అలా మన దనుకున్నవాడు దొంగ. వానిని దండించాలి' అని అన్నారు. 'కాని అలా జరగడంలేదు. మూటకట్టవద్దు. ఈ ధనసంపదలు శాశ్వతములు కావు. వెంటరావు. వెంటవచ్చేది ధర్మమొక్కటే అని ఎంతచెప్పినా మోహంతో గుడ్డిగా మానవుడు మూటలు కడుతూనే ఉన్నాడు' అని నేనన్నాను.

## సమగ్ర దృక్పథం

ఆ పెద్దమనిషితో మాట్లాడుతూంటే మన సమాజాన్ని గురించిన మౌలిక జిజ్ఞాస మనసులో మెదిలింది. అసలు ఈ 'మనం' అంటే ఏమిటో అనుభవరీత్యా తెలిస్తేనేగాని తత్త్వానికీ – వ్యవహారానికి మధ్య కన్పించే గండి పూడదని అనిపించింది.

సమాజం ఒక శరీరం లాంటిదన్నారు మన పూర్వులు. 'సహస్ర శీర్షా పురుషః, సహస్రాక్షః సహస్రపాత్' అని ఈ సమాజ శరీరాన్ని వర్ణించారు. అసలిది భగవంతుని వర్ణన. మనకు మన సమాజమే భగవంతుడు. ఈ విరాట సమాజపురుషుడు అనేక తలలతో, చేతులతో, ముక్కులతో, కన్నులతో, కాళ్ళతో భాసిస్తాడు. అలా భాసించే విరాట పురుషుని పూజించమని మనకు చెప్పారు. మరో విషయం – మన సమాజంలో, మానవులందరిలో, ఆ ఒక్క సమాజశరీరంలో మెదిలే ఆ ఏకచైతన్యమే వ్యాపించి ఉన్నదన్నారు. అందరిదీ ఒకే శరీరమనే విషయం, ఆ శరీరంలోని చైతన్యమొకటే నన్నవిషయం కొంతలోతుగా ఆలోచిస్తేగాని అర్థమవదు. మన అందరిలో ఉన్న చైతన్యం ఒక్కటే అంటే మన అందరి చిరంతనమైన అస్తిత్వం ఒకటేనని అర్థం. ఈ అస్థి

త్వానికి పేరేమిటి? పేరు ఏది పెట్టినా ఫరవాలేదు. అనుభూతి ఉండాలి. అనుభూతి ఆచరణలో కన్పించే విషయం. ఆర్థికంగా ఉపయోగార్హమైన వస్తువులన్నీ ఆ విరాటపురుషునికొరకే. ఈ దృష్టితో ఆలోచించండి. అప్పుడు ఆచరణ ఎలా ఉంటుందో తెలుస్తుంది. సమాజంగా భాసించే యీ విరాటపురుష కల్పనా, ఈ సమాజపురుషునిలో వ్యాపించిఉన్న చిరంతనమైన అస్తిత్వానుభవం - ఇదే భారతీయ దృక్పథ విశేషం.

సమాజమనే విరాటపురుష జిజ్ఞాస ఒక్క మన భారతదేశం మినహా ప్రపంచంలో మరెక్కడా కన్పించదు ఆ స్థాయికింకా ఇతరులు చేరలేదు.

ఈ ఆలోచనావిధానాన్ని విడిచిపెట్టి ఆలోచిస్తే సర్వమానవ సంక్షేమాన్ని గురించిన సమస్యలు పరిష్కారంకావు. ఈస్థితిలో ఉపయోగం కొరకు మనకు లభించేది అందరికీ లభించాలని ఎందుకు ఆలోచించాలి? మనవరకాలోచిస్తే చాలదా? ఇతరుల సుఖదుఃఖాలు మనకెందుకు? అసలు ఇతరులతో మనకేమిటి సంబంధం? - అనే పలు ప్రశ్నలు ఉదయిస్తాయి. మనం పంచభూతాల కలయికతో ఏర్పడే విడివిడి మట్టిముద్దలమనీ, మనకూ మిగతా ప్రాణులకూ అంతర్గత సంబంధం ఏమీలేదనీ హైందవేతర తత్వాలంటున్నట్లు భావిస్తే, మనలో ఇతరుల కష్టసుఖాలపట్ల సానుభూతి ఏర్పడదు. మన పరిసర జనం పడుతూన్న క్లేశాలను తొలగించి, సూఖాన్ని పంచాలనే ప్రేరణ కూడాకల్గదు.

అయినా ప్రపంచతత్వాలన్నీ యావత్ సమాజ శ్రేయస్సు నాశించే నడవాలని అంటున్నాయి. మరి ఏ ఆధారం మీద సమాజం అంతా ఒకటే నంటున్నారు? మనిషికీ మనిషికీ మధ్య సంబంధానికి కారణం ఏది? ఒకరితో ఒకరు కలిసి ఎందుకు ఉన్నారు? ఎలా కలిసి ఉన్నారు? ఇతరుల సుఖదుఃఖాలపట్ల సానుభూతి ఎందుకు కలగాలి? ఈ ఏకత్వాన్ని ఏసూత్రం అనుభవ సిద్ధం చేస్తుంది? ఒక భారతదేశాన్ని తప్పిస్తే,

మిగతా ఏ దేశమూ ఈ విషయాన్ని గురించి తాత్వికంగా ఆలోచించినట్లు కన్పించదు.

ఎవడికివాడు వేర్వేరు తత్వంతో జన్మిస్తాడనే మిగతావారి నమ్మకం. ఒకరితో మరొకరికి ఆంతరిక సంబంధం ఏమీ లేదని వారివాదం. అయితే ఒకరి మంచి చెడులతో మరొకరికి ప్రమేయం ఎందుకు ఉండాలి? ఒకరి మేలు మరొకరు కోరనక్కరలేదు. అందరి కడుపూనిండాలనే ఊహ రానక్కరలేదు. అందుకే ఆ యితర తత్వాలు ఒకే సమాజం అని వ్యవహరించినా, సమాజం అంటే 'అనేకుల స్వార్థాల కూడలి' అని వారి భావం. అందుకే దీన్ని 'ఒప్పందం' (Contract) అని వ్యవహరిస్తారు. తమ తమ స్వార్థాల సాధనకు ఒప్పందం చేసుకున్నారు. కనుక కలిసారు. వారికి తెలిసిన సమాజతత్వం ఇది. ఆంతరికంగా అందరినీ కలపడానికి, సుఖదుఃఖాలు అందరివీ ఒకటేనని, అందరిలో ఒకే చైతన్యం ఉన్నదనే అనుభూతిని ప్రబోధించేందుకు వారికి ఏ సాధనం లేదు.

మన అందరి అస్థిత్వం ఒక్కటేననే వాస్తవ సూత్రం ద్వారానే మనకు పరిష్కారం లభిస్తుంది. శరీరాలు ఎన్నైనా కావచ్చు. మానవులెందరైనా కావచ్చు. పైకి కన్పించే అభిరుచులు భిన్నంగా ఉండవచ్చు. అయినా అందరిలో ఒకే చిరంతనమగు అస్థిత్వం ఉన్నది. మౌలికంగా ఏకత్వం స్ఫురించడానికి కారణం ఇదే. దీనివల్లనే పరస్పర సంబంధాలను గురించిన భావాలు కల్గుతాయి ఒకరినొకరు ద్వేషించుకోడానికి కూడా ఈ ఏకత్వమే కారణం. సంబంధమే లేకపోతే ద్వేషం ఎలా కల్గుతుంది? ఈ సంబంధం లేకపోతే ద్వేషమూ లేదు, ప్రేమాలేదు. పరస్పర సంబంధాల విషయంలో మనలో పొడచూపే భావాలన్నిటికీ 'మన అందరి అస్తిత్వం ఒక్కటే' అనేదే కారణం. చిరంతనమైన ఈ అస్థిత్వమే మన అందరిలో అనుస్యూతంగా ఉన్నది. కనుక ముందు దీన్ని సరిగా మనసుకు పట్టించు

కోవాలి, ఇతరుల మనసులకు పట్టించాలి. నిజంగా వ్యవహారంలో ముం దడుగు వేయవలసిన విధానం ఇదే.

ఈ ఏకత్వానుభూతి కలిగినప్పుడే, మన అస్థిత్వం ఒకటి అనుకునే వాళ్ళతో ఏర్పడిన సమాజంలో అందరూ సుఖపడాలని కూడా అనిపిస్తుంది. దానివల్ల సమాన స్వార్థచింతన స్ఫురించే వ్యవస్థను ఏర్పరచుకోవాలని అనిపిస్తుంది. అంటే తన ఒక్కని స్వార్థచింత పనికిరాదన్నమాట. తన సంపూర్ణ రూపానికి అది వ్యతిరేకం. 'స్వ' అనే వ్యాపక తత్వానికి వ్యతిరేకం. అందుకే స్వార్థం ఆత్మఘాతకం కనుక, వదలుకోవాలని స్ఫురిస్తుంది.

ఈభావాలు గల జీవన తత్వమే హిందూ జీవన తత్వం. ప్రపం చంలో ఏవరూ ఈలోతులకు దిగి ఈ చిరంతన అస్థిత్వానికున్న ఆధారం గురించి అన్వేషించలేదు. ఇదే విశ్వమానవత్వానికి హిందూత్వమిచ్చిన కానుక. హిందూ జీవన తత్వంలోంచే ఈభావాలు జన్మిస్తాయి. ఈ భావాల తోటే సమాజ ధారణ జరుగుతుంది. ఈ ఏకాత్మభావాన్ని ప్రతివ్యక్తిలో నింపాలి. ఇది మన మొట్టమొదటి పని.

ఈ ఏకాత్మతను ఆధారంగా చేసుకొని, నిస్వార్థులను, సంగ్రహబుద్ధి లేనివాళ్ళను, సమాజానికి అంకితమైనవాళ్ళను వికసింపచేస్తూ, మానవ సమాజ జీవనమంతా ఒకే అస్థిత్వంతో స్పందిస్తూన్నదనే భావంగల ఈ వ్యక్తులద్వారా సమాజాన్ని సుఖ సమృద్ధులతో, మహోన్నతంగా నిర్మించ డానికి మనం కృషిచేయాలి ఇది మన కర్తవ్యం. దీన్ని నిభాయించడం చాలా సహజం. ఈప్రణాళికే మనకున్న విశేషమని నాభావం. అన్య సమా జాలు మంచిభావాలు మరేవైనా ప్రకటిస్తే, వారిని ఆమార్గాన ప్రయత్నం చేయనీయండి. కాని హిందూత్వ విశేషం మాత్రం ఇదే. ఇదే స్థాయీ రూపంగా నిలవగల విధానమని గడచిన వందలాది సంవత్సరాల చరిత్ర

ఋజువుచేసింది మానవ కళ్యాణానికి ప్రపంచంలో ఇతరత్రా బయలుదేరిన ఏభావమూ ఎక్కువకాలం బ్రతకలేదు ప్రపంచం మారుతుంది. కాలపు తాకిడికి ఆభావాలన్నీ నామరూపాలు లేకుండా పోయేవే. 'ఒకే సత్పదార్థం సర్వజీవుల్లో వ్యాపించి ఉన్నది. ఆపదార్థమే అందరినీ కలిపి ఉంచుతుంది. ఈ సత్పదార్థమే పరస్పర సుఖదుఃఖాలలో సానుభూతి కల్గడానికి. ఆ సానుభూతితో ఏకత్వాన్ని అనుభవింపచేయడానికి ఆధారం. ఈ ఏకత్వం వేరువేరు రూపాలుగా ప్రకటింపబడుతూన్నందున, ప్రతివారికీ, వారివారి అభిరుచుల కనుగుణంగా ఉత్తమ జీవనాన్ని గడిపే సదవకాశం లభింప చేయడమే పరమ కర్తవ్యం'– అని హిందూత్వం ప్రకటిస్తున్నది. అందుకే ఈ కర్తవ్యాన్ని నెరవేర్చుకోడానికి వ్యక్తిగతంగా జీవితాన్ని ఆ మూసలో మలచుకోవాలనే ప్రేరణ లభిస్తుంది ఈ ధోరణిలో ఆలోచించినప్పుడే ఎక్కువ ప్రోగుచేసుకోడం తగదు. ఉదరపోషణకు తగినంత తప్ప ఎక్కువ ప్రోగుచేసుకోవాలనే కోరికను దరిచేరనీయకూడదని స్ఫురిస్తుంది. ఉదర పోషణం అంటే కనీస జీవితావసరాలని వ్యాపకార్థం. అంతకు మించి సంచయించుకునే హక్కు మనకులేదు మిగిలిందంతా సమాజానిది. మన శక్తి సామర్థ్యాలతో ఎక్కువ సంపాదించినా, అదంతా, మనమే అనేకంగా కన్పించే ఈ ప్రజల కొరకే అని భావించాలి. హిందూతత్వాన్ని జాగృతం చేయడమంటే ఈ భావాన్ని గట్టి పరచడమే.

ఈ భావం గీటురాయి. మిగతా ఆర్థిక, రాజకీయ వ్యవస్థలన్నిటినీ ఈ ఆధారంతో నిర్మించుకోవచ్చు. ఆర్థిక రాజకీయ వ్యవస్థలు ఎలా ఉన్నా సమాజ జీవన నిర్మాణానికి ఇదే ఏకైకమైన ఆధారం ఇదే గట్టి ఆధారం. మౌలికమైన ఈ సిద్ధాంతాన్ని మనం విడిచిపెట్టాం. దీనిని మరచి నలువైపులా దేవులాడడం మొదలు పెట్టాం ఫలితం మనకు కన్పిస్తూనే ఉన్నది. మనచుట్టూ ఎంత పేదరికం వ్యాపించి ఉన్నదో ప్రతినిత్యం

మనకు కన్పిస్తూనే ఉన్నది. ఈ దారిద్ర్యానికి, దైన్యానికి హిందూత్వమే కారణమని కొందరంటారు. ఇది వాస్తవం కాదు. హిందూజీవనసిద్ధాంతాన్ని మరచిపోయినందువల్లనే ఈ దైన్య దారిద్ర్యాలు వచ్చాయి. హిందూజీవన సిద్ధాంతాన్ని ఆచరించనందువల్ల ఈ గతిపట్టింది. నేడు కన్పిస్తున్న అంట రాని తనం లాంటి చెడుగులకు హిందూత్వమే కారణమని అనడం చాలా తప్పు. హిందూజీవనతత్వాన్ని విస్మృతంగా గ్రహించి, ఆచరించనందువల్లే ఈ చెడులు అన్నీ పుట్టాయి.

## నాల్గు పురుషార్థాలు

కనుక, ప్రపంచం ముందు మన రాష్ట్రజీవనం చతుర్విధ పురుషార్థ జీవన నిర్మాణమనే ఒక మహత్తర ఆదర్శంగా అవతరించిందని గ్రహిం చాలి. ప్రప్రథమంగా, ధర్మపురుషార్థంలో భాగంగా మన అందరిలో ఒకే తత్వం ఉన్నదనే ఆధారంతో ఏకాత్మానుభూతిని నిర్మించాలి. వేర్వేరు అస్తిత్వాలను ఒప్పుకుంటూ, మనం సోదరులమని ప్రకటించే పద్ధతికూడా కాదిది. మన సమగ్రజీవనంలో ఏకాత్మభావం ఉన్నదనే ధృఢమైన విశ్వాసం ఇందులో ఉన్నది. అనేకులు కలిసి సమాజం ఏర్పడడమనేదికాదు. ఆ 'ఏకమే' అందరిలో నిండి ఉన్నది. కనుక సమాజ భిన్నమైన అస్తిత్వం మరొకటి మనకు లేనేలేదు. ఈ తత్వం అనుభవానికి వస్తే సహజమైన సోదర భావం కలిగి, తత్ఫలితంగా, మన సర్వశక్తులనూ ఉపయోగించి సంపాదించాలని, ఆ సంపాదించిన దాన్ని అందరికీ అధికాధిక సుఖం లభించేందుకు పంపకం చేయాలనీ ఊహకలుగుతుంది. ఈ పంపకానికై అధికోత్పత్తికి పూనుకోనాల్సివస్తుంది. దీనితో మరో ప్రశ్న పుడుతుంది. సుఖవిలాసాల సామాగ్రిని ఎక్కువగా నిర్మించి, పంపిణీ చేస్తే దానితో భోగాపేక్ష నిగ్రహం తప్పి అదుపు లేకుండా పెరిగితే వినాశానికి దారి

తీస్తుంది. అందుకే ధర్మంతో పాటు చతుర్థ పురుషార్థమైన – అనగా జీవనానికి చరమ లక్ష్యమైన – మోక్షాన్ని మరువరాదని హెచ్చరించారు. మానవులకు అంతిమ లక్ష్యం భోగవిలాసాలుకావు. కనుక మానవుడు భోగ విలాసాలకు దాసుడుకాలేడు. మానవుడే ఈ భోగవిలాసాలను నిర్మించింది. కనుక మానవుడు వీటికి యజమాని. అందుకే వీటిని తన జీవన లక్ష్యాన్ని చేరుకునేందుకు ఉపయోగించుకుంటాడు. అలా జరిగిన నాడు జీవితం సుఖ సంపదలతో, మోక్షపురుషార్థం నుండి స్ఫూర్తి పొందుతూ, త్యాగమయంగా రూపొందుతుంది. ఇలా ధర్మ, మోక్షాల కట్టుబాటులో ప్రగతి శీలమైన సమగ్రజీవన ప్రణాళికను మన దేశంలో కనుగొన్నారు. ఇది పూర్తిగా ఆచరణీయమైన పద్ధతి.

ఈభావంతో పూర్తిగా కష్టించి, అధికంగా ఆర్జించి, పంచగలుగుతాడు. తన స్వంతానికి సంచయించుకోడు. చివరకిదే జీవన కర్తవ్యంగా ఏర్పడుతుంది

మనముందున్న లక్ష్యం ఇదే. దీనినానరాగా గ్రహించి తయారైన ఏ రాజకీయ వ్యవస్థ ఐనా ఫరవాలేదు; ఏ ఆర్థికవిధానమైనా ఫరవాలేదు.

ఈ గీటురాయి మీదే, విదేశాలనుండి వచ్చిన పెట్టుబడిదారీ విధానాన్ని, సమాజవాదాన్ని, సామ్యవాదాన్ని పరిశీలించాలి. గ్రుడ్డిగా అనుకరిస్తే లాభంలేదు. మన హిందూ జీవనానికి సారభూతంగా, అండగా ఉన్న ఈ సూత్రాన్ని జ్ఞాపకం చేసుకొని ఆలోచిస్తే, విదేశీవాదాలలో దేనిలోనూ ''సమాజమంతటిలో ఒకే చైతన్య వస్తువు ఉన్న''దనే భావం, ఎక్కడా కన్పించదు. ఈతత్వం లేని కారణాన ఆవాదాలన్నీ పరస్పర శత్రుత్వాన్నే నిర్మించాయి. ఒక్క రాజకీయ వ్యవస్థల విషయం చూడండి. ప్రతివ్యవస్థా మరో విప్లవానికి నాంది పలికేదే. ఫ్రెంచి విప్లవానికి ముందు ప్రభుత్వ శక్తి, ఆర్థిక నియంత్రణమూ రాజుల చేతులలో ఉండేవి.

ప్రభుత్వశక్తి అదుపు తప్పినందున ప్రజ హాహాకారాలు చేస్తుండేవారు. ఈ నిరంకుశానికి వ్యతిరేకంగా విప్లవం పుట్టింది అదేకాలంలో పారిశ్రామిక విప్లవం వచ్చింది. దీంతో ధన సంపదలు ఒకే చేతిలోకి వచ్చాయి. భూస్వామికశక్తిని (fuedal) కూలద్రోసి, ధనబలం ప్రభువై కూర్చున్నది. ఈ ధనబలం చేసిన దోపిడీకి ఎదురు తిరిగి శ్రామికశక్తి విప్లవం లేపింది. నేడు శ్రామికశక్తి చేజిక్కించుకుంటూన్న నిరంకుశాధికారాన్ని వ్యతిరేకిస్తూ విప్లవ బీజాలు నాటుకుంటున్నాయి. ఈవిధంగా మనిషి ఎటు పోతున్నదీ తెలియడంలేదు. ఈ విదేశీ వాదాలన్నిటికీ మూలతర్కం 'మనిషికి మనిషి విరోధి' అనేదొక్కటే. అసూయతో పోటీకి దిగడం మనిషి స్వభావం. తాను ముందుకు పోలేకపోతే ముందున్నవాణ్ణి వెనక్కులాగి తన గొప్పదనాన్ని నిలుపుకోడం మానవ లక్ష్యం ఈ అసూయాద్వేషాలతో పెనుగులాడడమే ప్రగతి-అభ్యుదయం. పైగా ఈ పద్ధతితో నిజంగా ప్రగతి సాధించామని జబ్బలు చరచడం. కాని ఈ అసూయ, ఈపోటీ, ఈ శత్రుత్వంవలన ఏదైనా ప్రగతి కన్పించినా దానికై జరిగిన మారణహోమం సామాన్యమైనదా? చివరకు మారణహోమం ప్రగతిని మించిపోతుంది.

ఈ దోషాలనుండి తప్పించుకుని, ఒకే సత్పదార్థాన్ని ఆధారంగా స్వీకరించి సమష్టి జీవన లక్ష్యాన్ని మనం ప్రపంచం ఎదుట నిలిపాము కాని దీంట్లో ఒక బాధ ఉన్నది. మనం సిద్ధాంతాన్ని అనుసరించి నడుచుకోడం పూర్తిగా మానివేశాం. ఈదోషం పైన చెప్పిన మిగతా దోషాలన్నిటికన్నా దారుణమైంది. తెలియక తప్పు చేయడం వేరు కాని తెలిసి ఆచరించకపోవడం మహాదోషం. ఈ దోషాలను తొలగించుకోడానికి ప్రయత్నం జరగాలి. సిద్ధాంతాన్ని ముందుంచుకొని, దానిప్రకారం నడచుకోవాలని నిత్యం జ్ఞాపకం ఉంచుకోవాలి.

## అభిమానం - నిశ్చయం

ఈ అనాచార దోషాన్నుండి సమాజాన్ని కాపాడదగు మహత్తర కార్యాన్ని మనం చేయాలి. ఆయారంగాలలో ప్రగతిని సాధిస్తూ, హిందూ జీవనానికి కారకమైన ఈ మహత్తర కళ్యాణ కర సిద్ధాంతమే వాస్తవమైన తత్వమని ఋజువు చేయాలి. దీన్ని సాధించడానికి నేనొకమాట చెప్తాను. 'నేను హిందువు' నని అభిమానపడండి. ఇది 'నా సమాజం – నారాష్ట్ర' మని అభిమానం కలిగి ఉండండి. 'నా గొప్పదనంతో ప్రపంచంలో ఈ రాష్ట్రాన్ని మహోన్నతంగా నిర్మించి నిలుపుతాననే భావాన్ని కలిగిఉండండి. ఈ అభిమానం, ఈనిశ్చయం లేనిదే ప్రగతి సూచకమైన ఏ మార్పునూ మనం సాధించలేము. ఈ అభిమానాన్ని బలపరచుకోండి. ప్రపంచం ఏమనుకున్నా ఫరవాలేదు. మన సమాజాన్ని ఏకాత్మభావంతో నింపాలి. మన రాష్ట్ర జీవనాన్ని ఇక్కడ తిరిగి నెలకొల్పాలి. ఈ మన నిశ్చయాన్ని ప్రపంచం ఎదిరించి నిలిస్తే ఎదిరిద్దాం. ఎదిరించి గెలుద్దాం. ఈ నిశ్చయం ఈ స్వాభిమానం అంకురిస్తే. మిగతాపని తేలికగా జరుగుతుంది. ఈ విషయంలో బలహీనతను ప్రదర్శిస్తే, ఒక హిందూ ధర్మ సిద్ధాంతాలేకాదు, మిగతా ఎన్నెన్ని సిద్ధాంతాలను క్రోడీకరించుకున్నా, పరమేశ్వరుడు స్వయంగా మనికిచ్చినవని ప్రచారం చేసినా ప్రయోజనం లేదు ఇది స్పష్టం మీరుకూడా దీనిని గురించి ఆలోచించండి

ప్రాచీనము, చిరంతనమునైన మన హిందూరాష్ట్రాన్ని ప్రపంచంలో మళ్ళీ గొప్పదిగా చేయడానికి, బలంగలదానినిగా, జయశీలిగా, తాను సుఖించి ప్రపంచానికి సుఖాల నివ్వగలదానినిగా చేయడానికే మన మీ లక్ష్యాన్ని స్వీకరించాం. కనుక ఈ లక్ష్యాన్ని సాధించేందుకే మనం అనేక కార్యక్రమాలను, పనులనూ ప్రారంభించాలనే విషయాన్ని మరువవద్దు. ఇదే లాభదాయకమైన దృష్టి. పట్టుదలతో ఈ ధ్యాసను జ్ఞాపకం ఉంచు

కుంబా పురోగమించాలి. ఈభ్యాసను మరిస్తే దారితప్పవచ్చు లక్ష్యం వైపు నడుస్తున్నామనుకుంటూనే, పెడదారులు త్రొక్కవచ్చు. కాంగ్రెసే దీనికి నిదర్శనం ప్రారంభదశలో కాంగ్రెసు నాయకులు మన యీ రాష్ట్రంలో హిందూ జీవనావసరాన్ని గట్టిగా ప్రతిపాదిస్తూండేవారు. దీనిని హిందూరాష్ట్రమని కూడా వ్యవహరిస్తుండేవారు. లోకమాన్య తిలక్ ఉపన్యాసాలలో ఈమాటలు వినిపించేవి. మహాయోగి అరవిందుడు మాతృభూమికి, సాక్షాత్తు జగన్మాత అని, ఆదిశక్తి అని, మహామాయ అని, మహాదుర్గ అని నమస్కరించి హిందూరాష్ట్రాన్ని స్ఫురింపచేశాడు. విశ్వకవి రవీంద్రుడు 'దేవి! భువన మనమోహిని! నీలసింధూజల ధౌతచరణతల' అని మాతృకీర్తిని ఆలపించాడు బంకించంద్రుడు తన అమృత గీతం - వందేమాతరమ్‌లో, 'త్వం హి దుర్గా దశప్రహరణ ధారిణీ' అని స్తుతించాడు. ఆమాటల్లో మన రాష్ట్ర వాస్తవరూపం కన్పించింది. కాంగ్రెసు మహాసభల్లో, మనరాష్ట్రం, మనరాష్ట్ర సంస్కృతి, సభ్యత, చరిత్ర, పరంపరలను ఆదరాభిమానాలతో ఉల్లేఖించేవారు. కాని నేడు రాజకీయపు వత్తిళ్ళు మొదలైనాయి. వాటినే ఎత్తులంటున్నారు. హిందూశబ్దాన్ని విని, విసుక్కునే ఆయా జనాలను బుజ్జగించాల్సిన అవసరం కన్పించ నారంభమైంది. నెమ్మదిగా మాటల్లో మార్పువచ్చింది. కొన్నాళ్ళు హిందీలన్నారు కొన్నాళ్ళు హిందుస్థానీలన్నారు. ఇండియన్ అని, దానికి అర్థంగా భారతీయ అని వాడారు. ఈ రాజకీయ దౌర్బల్యాన్ని కప్పిపుచ్చుకోడానికి, 'పేరులో ఏమున్నది' లెమ్మన్నారు. హిందువంటే కొందరికి గిట్టదు కనుక భారత్ అని వాడమని సలహాలిచ్చారు.

భారతీయ శబ్దం చాలా ప్రాచీనమైనది. నిజమే. మన మాతృభూమిని వర్ణించిన ప్రాచీన ప్రయోగాలలో 'భారత్' శబ్దం కూడా ఒకటి.

"ఉత్తరం యత్ సముద్రస్య, హిమాద్రేశ్చైవ దక్షిణమ్,
వర్షం తత్ భారతనామ, భారతీయత్ర సంతతిః" ॥

కనుక భారత, భారతీయ శబ్దాలను వాడడం ఆనందదాయకమే. కాని ఇండియన్ అనేపదాన్ని వాడి, దాని కర్థసూచకం భారత్ అని వాడడం, హిందూశబ్దాన్ని మరపించడానికి ప్రయత్నించడం తలా తోకా లేని వ్యవహారం. ఇది ఇప్పటికే చాలా కీడుచేసింది. మన రాష్ట్ర జీవనాన్ని గురించి ఆలోచించే ధోరణే దీనితో మారింది. అలా 'హిందు' అంటే వెగటు పుట్టేవరకు వచ్చింది. అసహ్యం అని కటువుగా అనలేక వెగటు అనడం అన్నమాట. మార్పు ఎలా వస్తున్నదో చూడండి

కనుకనే 'పృథివ్యాయై సముద్రపర్యంతాయా ఏకరాట్' అంటూ వేదకాలంనుండి మనం నమస్కరిస్తూవచ్చిన మాతృభూమి నేడుకూడా 'గంగేచ యమునే చైవ గోదావరి, సరస్వతీ, నర్మదే సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు' అని మనం జపిస్తూ, స్మరిస్తూన్న మాతృభూమి హిందు భూమియే అని నిస్సందేహంగా వాస్తవాన్ని ప్రకటిస్తుండాలి. మన యీ భారతమాత అఖండమైనది. అవిభాజ్యమైనది. ఇదే మన మాతృభూమి. నలువైపులా పైకొంటూన్న పరాస్త వాతావరణంలో హిందూరాష్ట్రభావాన్ని చాలా గట్టిపట్టుదలతో నిలపాలి. హిందూత్వమంటే మతతత్వమనే ప్రచారం ప్రబలుతూన్నందున తమకుతాము హిందువనుకోడానికి చాలా మంది భయపడుతున్నారు. పైగా 'హిందు' అనేశబ్దాన్నే తొలగించమంటున్నారు. ఉదాహరణకు :- మహాయోగి అరవిందుని సాహిత్యాన్ని ప్రచురించేకొరకు భారత ప్రభుత్వం కొంత ధనసహాయంచేస్తే బాగుండునని అనిపించింది. భారతప్రభుత్వం సహాయపడేందుకు రెండు షరతులు పెట్టిందట. మొదటిది – అరవిందాశ్రమంలో ఉన్న అఖండభారత చిత్రపటాన్ని తొలగించి, నేటి రాజకీయ భారతచిత్రాన్ని అక్కడ పెట్టమన్నారు.

రెండవషరతు - అరవింద సాహిత్యంలో ప్రయోక్తమైన 'హిందు', 'సనాతనధర్మ', 'హిందూరాష్ట్ర' శబ్దాలను పునర్ముద్రణలలో వాడరాదు. శ్రీ అరవిందాశ్రమవాసులు ఈ షరతులను తిరస్కరించారు. ఆ మహాయోగి దయవల్ల, ఆశ్రమానికి చైతన్యస్వరూపమైన శ్రీ మాత మహానిశ్చయంవల్ల అలా తిరస్కరించగలిగారనేది గ్రహించవచ్చు. ధనం యివ్వకపోతేపోనీ, కాని డబ్బుకొరకు 'ఆయన ప్రబోధాలకు ఆత్మయైన విషయాన్ని మార్చడం అసంభవం'. (Soul of his teachings cannot be changed) అని ఆశ్రమంనుండి జవాబు వెళ్ళింది. యోగిరాజు అరవిందుని విశ్వాసాలగురించి, ఆయన ప్రబోధాల మూల సూత్రాలగురించీ రాజీ పనికిరాదు. ఇలాంటివే హిందూశబ్దాన్ని వదులుకొమ్మని వత్తిళ్ళు తెస్తారు. అలావచ్చినప్పుడు 'ఈ శబ్దం ప్రయోగించి లాభంలే' దని కొందరనుకునేవాళ్లుంటారు. ఈ శబ్దానికి దూరంగా ఉంటే మంచిదంటారు. నేటి రాజకీయ వాతావరణంలో హిందూత్వాన్ని విడిచి పెట్టడమే బుద్ధిమంతుల లక్షణమంటారు

కాని ఇది లాభంచేకూరుస్తుందా ? ఇట్లా హిందూరాష్ట్రమనే చరిత్ర ప్రసిద్ధమైన, అనుభవసిద్ధమైన సత్యాన్ని విస్మరిస్తే, ఈ రాష్ట్రంకొరకు త్యాగంచేయాలనే బుద్ధి, బలి అవాలనేభావం, కష్టపడాలనే పూనిక, విజయాలు సాధించాలనే మహదాకాంక్ష ఉంటాయా ? నేటికీ స్వసుఖాపేక్ష వదలిపెట్టి, రాష్ట్రసేవకొరకు నిశ్చయంతో పురోగమిస్తూన్నవారందరిలోనూ మన యీ సనాతన హిందూరాష్ట్రాన్ని ప్రపంచంలో సర్వశ్రేష్ఠ దేశంగా, సర్వశక్తిగలదేశంగా, తీర్చిదిద్దాలను ప్రేరణే పనిచేస్తున్నదని నా విశ్వాసం. ఈ ఆదర్శప్రేరణతోటే ఏకాగ్రచిత్తంతో పనిచేస్తున్నారు. ఈ ప్రేరణే నశిస్తే, తమ సర్వస్వం సమర్పించి పనిచేసే మన పరంపర మొత్తం నశిస్తుంది. జీతంకోసం చాకిరిచేసే జనం లభించవచ్చు. సర్వమూ త్యగంచేసి పనిచేయాలనే ఉదాత్తభావం నశిస్తుంది.

కనుక మన రాష్ట్రాన్ని సూచించడానికి పర్యాయంగా ఏశబ్దాన్ని ప్రయోగించినా, ఆ శబ్దం హిందూరాష్ట్ర గౌరవాన్నే అసందిగ్ధంగా ప్రకటించాలి. ఆయారంగాలలో పనిచేసే మనకార్యకర్తలు, నలుదిశలలోస్పష్టంగా ఈ సిద్ధాంతం తర్కపూర్ణమైనదని, చరిత్రసిద్ధమనీ, భావగర్భితమని, ఋజువుచేస్తూ పురోగమించాలి. ఈ వాస్తవసిద్ధాంతాన్ని ప్రజలు ఆదరంగా ఆలకిస్తారు. అంగీకరిస్తారుకూడా. ఇది నా అనుభవం.

ఈ విధంగా పనిచేస్తే మరోలాభం ఉన్నది. దీంతో ఆయారంగాలలో జరుగుతూన్న పనులలో సహజంగా సమన్వయం ఏర్పడుతుంది. నేడు మన కార్యకర్తలు ఎన్నో క్షేత్రాలలో పనిచేస్తున్నారు. వీరందరిమధ్యా సమన్వయం ఉండాలని ఎన్నోసార్లు అంటూఉంటారు. సమస్య ఏదైనా వస్తే, నలుగురంకూడి ఆలోచించుకున్నంతమాత్రాన సరిపోతుందా ? సమన్వవస్తే కలిసి ఆలోచించడం అవసరమే. కాని అందరూ హిందూ రాష్ట్రస్థాపనకే లక్ష్యంగా పెట్టుకొని పనిచేస్తే, పరిస్థితుల కారణంగా ఏర్పడే సమస్యలలో సామరస్యాన్ని సాధించడం చాలాతేలికవుతుంది. అందుకే 'వయం హిందురాష్ట్రాంగభూతాం'' అని మన నిత్యశాఖలో మాతృభూమికి నమస్కరిస్తూ, అసందిగ్ధంగా ప్రకటిస్తున్నాం. ఈప్రేరణతోటే పనిచేస్తున్నాం. గుణవంతులు అంటే ధర్మనిష్ఠగలవారు, నిస్వార్థులు, పదవీ ప్రతిష్ఠలనూ, గౌరవాదరాలనూ, మిగతా కోరికలన్నిటినీ అధిగమించి, మన సమాజ ప్రతిష్ఠను నెలకొల్పడమే మహానందకరమని భావించేవారు చాలా ఎక్కువసంఖ్యలో నిర్మాణంకావడమే మన యీ కార్యక్రమ లక్ష్యం. తమనుజూచి ప్రజలుకూడా ధ్యేయనిష్ఠతో బాగుపడవచ్చునని ఆత్మవిశ్వాసం పొందగలిగేటట్లు, తమ మార్గదర్శనంకొరకు సమాజం ఎదురుచూచేటట్లు, జీవించగల వ్యక్తులతో అనుశాసనంతో

సూత్రబద్ధమైన శక్తిని నిర్మించాలి. ఇది అవసరం. ఏమహాశక్తివలన ఈ విశాల సమాజాన్ని ప్రేమ, విశ్వాసాల కౌగిలిలోకి చేర్చుకొని అందరి సంక్షేమానికి కృషి ప్రారంభంకాగలదో, అలాంటి శక్తిని నిర్మించేపనిఇది. మనమే ఈపనిచేయాలి. ఇది మనపని. మనతో ఈపని ప్రారంభంకావాలి. మందికి ఉపదేశించడంకాదు. ఉపదేశాలతో పనులు జరుగవు. మనలో ఆవిధమైన శీలం ఉండాలి. సంపూర్ణ సమాజం బాగోగులతో లీనమై పోవాలి. నలుగురి సుఖదుఃఖాలు స్వంత సుఖదుఃఖాలైపోవాలి. దుఃఖ నివారణకు వ్యక్తిగానేకాక, యోజనాబద్ధంగా కలిసి పనిచేయగల సంసిద్ధతను నిర్మించాలి. ఆ తరువాత సంఘాన్నిగురించి ఎక్కువ వివరించనవసరం లేదు. ప్రతిబాధనుండి రాష్ట్రాన్ని రక్షించి, ఆపదల నెదిరించగల బలమైన గోడలా నిల్చి రక్షణచేకూర్చే రాష్ట్రశక్తిని, చైతన్యాన్ని మనంనిర్మించాలి. అందుకే మన జీవనంలో ప్రవేశించే దౌర్బల్యాలను, వికారాలను తొలగించ డానికి ఎంత కఠినపద్ధతులకైనా సిద్ధంగాఉండి, ఏకసూత్రభావాన్ని ఆవిష్క రించుకునేందుకు ప్రయత్నించవలసిన అవసరం ఉన్నది. ఇదే మనం చేయవలసిన పని. ఇదే సంఘం.

# సమాజవ్యవస్థ - పరిశీలన

ఆధునిక జీవనం అంటూఉన్న జీవనం కొన్ని దేశాలలోకన్పిస్తు న్నది. ఆ దేశాలలో కన్పించే ఆ ఆధునికజీవనాన్ని మనదేశపు జీవన ఆదర్శాల ఒరిపిడితో చూస్తే కొన్నివిషయాలు కన్పిస్తాయి. ఈ సుఖాల వెనుక కన్పించే ఎడతెరిపిలేనిపోటీ మొదటిది. భోగవిలాసాల సామగ్రిని సంపాదించుకోడానికి ఒకరితో ఒకరు పోటాపోటీలు పడుతున్నారు. దీనితో పాటే మరోగాలికూడా ఉన్నది. దాన్ని ఈనాటిభాషలో 'పర్మిసివ్ సొసైటీ' అంటారు. పర్మిసివ్ సొసైటీ అంటే వ్యక్తికి అన్నిటా పూర్తి స్వేచ్ఛ

ఉన్నది అనిభావం. నిర్బంధమనేది లేనేలేదు. పర్మిసివ్ అంటే సూటి అర్థం 'అదుపులేని' అని. ఏమైనా చేయవచ్చునన్నమాట. ఇదేవ్యవహారం ఇదే ఆలోచన రచనల్లో, ఉపన్యాసాలలో, భావాలలో, ప్రతిరంగంలో దీన్నే అనుసరిస్తున్నారు. ఈ పర్మిసివ్ (స్వేచ్ఛాభారం) గాలి ఇక్కడికి కూడా నెమ్మది నెమ్మదిగా వస్తున్నది. అడ్డగించడం సాధ్యమా ? అడ్డగించదలిస్తే, మార్గం వెదకడం సాధ్యమా ? 'అడ్డగించడమా ? వద్దు. ఇది మంచిదే. సమాజప్రగతికిది చిహ్నం' అనేవాళ్లూ ఉన్నారు. కాని ఈ పర్మిసివిజం (స్వేచ్ఛాచారం) వల్ల సమాజమే లేకుండాపోతుందని ఈ విధంగా మాట్లాడే జనం గ్రహించాలి. దీనివల్ల మిగిలేది 'ఒప్పందపు' సిద్ధాంతమే. మనిషికి ఇష్టారాజ్యం కావాలి కనుక అడ్డుతగలకుండా ఉండేందుకు మనుష్యులు పరస్పరం ఒప్పందం (contract) చేసుకోవాలి. ఈ ఒప్పందం ఫలితంగా వ్యక్తుల సమీకరణం జరుగుతుంది పశ్చిమ దేశాలలో ఈ కాంట్రాక్టు సిద్ధాంతం అమలులోఉన్నది. అక్కడ వ్యక్తి స్వేచ్ఛాచారి. 'సమాజమెవరు?' అంటాడు. వ్యక్తులు చేసుకునే ఒప్పందానికి ఇదే ఫలితం. చివరకు దీనివల్ల సమాజమనే శక్తి క్షీణిస్తుంది. భారతదేశంలో సమాజమనే పేర విశేషంగా ప్రాణధారకంగా మనం రూపొందించుకున్న సమష్టి తత్వం ఈ స్వేచ్ఛాచారంతో సమాప్తమవుతుంది.

అక్కడి మరో విషయం పోటీ – స్పర్థ అంటారు. స్వస్థకరమైన పోటీ ప్రగతికి సాధనమని కొందరంటారు. కాని పోటీ అనేది స్వస్థకరంగా ఎప్పుడూ ఉండదు. పోటీ అంటూ ఉంటే మొదట కొంతమేలుకన్పించినా, చివరికి చెడు త్వరగా ప్రవేశిస్తుంది. పోటీలో మిగతావారిని మించాలనే కోరిక పుడుతుందంటారు కాని ఈ పోటీతో ఎదుటివాణ్ని తనకంటే హీనుణ్నిగా చేయాలనే ప్రయత్నం సర్వత్రా జరుగుతుంటుంది. తాను పైకి రావడంకన్నా ఎదుటివాణ్ని పడగొట్టే ప్రయత్నంలోనే పడిపోతాడు. క్రీడారంగాలలోకూడా ఇదే నేడు కన్పిస్తున్నది. నిజానికి ఇవి ఆటలే.

గెలుపొకరికి, ఓటమి మరొకరికి సంతోషంగా ఫలితాన్ని స్వీకరిస్తూ, ప్రతి వ్యక్తి తనగుణాన్ని, కౌశలాన్ని, చురుకుతనాన్ని పెంచుకునే ప్రయత్నం చేయాలి. కాని నేడు ఆటల్లోకూడా సరసమైన పోటీ కన్పించడంలేదు. ఓటమి వస్తున్నదనగానే కొట్లాట ప్రారంభమవుతుంది. రకరకాల తెలువు లతో ముందుకు వెళుతూన్నవాడిని పడగొట్టే ప్రయత్నం చేస్తారు. పోటీలో ముందు కొంత సరసంగానే ఉంటుంది. చివరకది కన్పించదు. మానవ స్వభావాన్ని తరచిచూస్తే, పోటీ అంటూ సరసంగా ఎన్నటికీ ఉండదనే చెప్పాలి నేడు ప్రపంచంలో ఎన్నోరకాల కలహాలు జరుగుతున్నాయి. ప్రతిదేశం శాంతి కావాలనే ప్రకటిస్తుంది. కాని పరస్పర యుద్ధాలు జరుగుతూనే ఉన్నాయి ఒక రాష్ట్రప్రగతి మరో రాష్ట్రానికి కంటకంగా భావిస్తున్నారు. ఒంటరిగానో, కూటములుగా ఏర్పడో మిగతా రాష్ట్రాల ప్రగతిని అవరోధించడానికి ప్రపంచశక్తులు ప్రయత్నిస్తూనే ఉన్నాయి. ఇతరుల సుఖాలను నాశనం చేయాలనే కోరికే ఈ కలహాలకు కారణం. ఇట్లా పోటీ చివరకు పోరాటానికి దారితీస్తుందడం మనకు కన్పిస్తూనేఉన్నది. పశ్చిమదేశాలలో నెలకొన్న ఈ పర్మిసివ్‌నెస్ (స్వేచ్ఛాచారవాదం) వలన, ఈ పోటీ (కాంపిటీషన్) వలన మానవ కళ్యాణం జరగడమనేదిఅసంభవం.

## మానవ జీవన లక్ష్యం

ఈ సందర్భంగా మరో ముఖ్యమైన విషయాన్నికూడా తరచి చూడాలి. మానవ జీవితానికి లక్ష్యం ఏమిటి ? ఏ లక్ష్యాన్ని మానవుడు తనముందుంచుకోవాలి ? సుఖవిశ్రాంతులూ భోగవిలాసాలూ మానవజీవన లక్ష్యాలా ? స్థూలంగా మానవునిలక్ష్యం సుఖం అని పలువురంటారు. సుఖం తగ్గితే దుఃఖం కలుగుతుంది. కనుక సుఖం శాశ్వతంగా ఉండాలని మానవుడు వాంఛిస్తాడు. అంతులేని అమృత సుఖాన్ని అపేక్షిస్తాడు. ఈ కోరిక మానవుణ్ణి ఆకర్షిస్తుంటుంది. అంటే మానవుడు తన నిజమైన

రూపాన్ని గ్రహించి, ఉత్తమము, ఆనందమయమునైన శాశ్వతజీవనాన్ని సాధించడానికి ప్రయత్నిస్తుంటాడు. ఇదే మానవ జీవనలక్ష్యమని భావించారు.

మనిషి శరీరంతో వ్యవహరిస్తాడు. కనుక శరీరానికి అవసరమైన వాటిని తీర్చుకోవాలి. వానిలో ఎన్నో భోగసామాగ్రి ఉంటాయి. వాటిని కాదని, నిరాకరిస్తే ప్రపంచంలో పని సాగదు. అలా నిరాకరిస్తే భోగ వాదులు విప్లవం లేవదీస్తారు. భోగసామాగ్రిని పూర్తిగా నిషేధించడం ఆచరణసాధ్యంకాదు. కనుక పెద్దలు ఈ విషయాన్ని వ్యావహారికంగా ఆలోచించి, మనశ్శరీరాలను ఆకర్షించే భోగసామాగ్రిని నిషేధించనక్కర లేదని, కాని వాటి సంపాదనలోనే మానవుడు మునిగిపోకూడదని, ఆత్మ నాశనం తెచ్చుకోకుండా శ్రేష్ఠమైన మానవ జీవనలక్ష్యాన్నిగురించి మననం చేసుకుంటూ ఉండాలని అన్నారు.

సుఖమేకదా లక్ష్యం! ఈ లక్ష్యానుభూతి బైటనుండి రానక్కర లేదు. ఎందుకంటే ఇది అందరిలో ఉంటుంది. ప్రపంచంలో సుఖాపేక్ష లేని జీవుడులేడు. జీవి కోరేది క్షణికసుఖంకాదు. జీవి కోరేది శాశ్వత సుఖాన్ని, అక్షయసుఖాన్ని – అంటే అమరమై విలసిల్లే సుఖమన్నమాట సూర్యచంద్రులున్నంతమేరకు లభించే సుఖంమాత్రమేకాదు, మూడుకాలాల తీతమైన సుఖాన్ని పొందాలనే కోరిక మనిషికి ఉంటుంది. కాని ప్రతిక ప్రాణికీ ఈ శాశ్వతసుఖాన్ని గ్రహించే బుద్ధి ఉండదు. కనుక మామూలు ఇంద్రియ సుఖాలకై ఏర్పడే కోరిక పొంగును తృప్తిపరచుకునేందుకు పరుగులుతీస్తాడు. కాని మనిషి ఆలోచనాపరుడు. కనుక కోరిక పొంగుల తృప్తికి ఉపాయం వెదుకుతాడు. ఈ ప్రయత్నాలలో కొన్ని మిగతా ప్రాణులవిధంగానే ఉంటాయి. సృష్టికర్త ఇంద్రియాలను నిర్మించినప్పుడే, వాటిని బైటికి పరుగులుతీసే వాటినిగా నిర్మించాడు. అందుకే ఇంద్రియాలు

అంతర్విలోకనంతో వాస్తవసుఖాన్ని చూచేందుకుకూడా సిద్ధపడవు. విద్వాంసులు దీన్ని చక్కగా వివరించారు నేను ఒక మంత్రంవిన్నాను- 'ఇంద్రియాలు బహిర్ముఖాలు బైట సామాగ్రితో సుఖాన్ని పొందాలని చూస్తాయి' అని. ఇదే ఇంద్రియస్వభావం. 'కాని వివేకులు బైటివస్తువులు వాస్తవసుఖాన్ని యివ్వజాలవని గ్రహించారు! అనికూడా ఆమంత్రంలో ఉన్నది. ఇంద్రియాలవల్లకల్గే ప్రతిసుఖమూ, చివరకు దుఃఖాన్నే తెస్తుంది. ఇంద్రియసుఖం దుఃఖానికి దారితీస్తుందని గ్రహించవచ్చు. కనుక తనలో శాశ్వతసుఖాన్ని పొందాలనే కోరిక ఉన్నట్లు గ్రహిస్తాడు. మరి ఈ శాశ్వత సుఖం ఎక్కడో ఒకచోటవుండాలికదా! బైటలేదనుకుంటే లోపల దొరుకు తుందా? అనంతసుఖాభిలాషఉంటే, అనంతసుఖం అంటూ ఎక్కడో ఉండాలి. మరి దీన్ని పట్టడం ఎలా? భోగసామాగ్రివల్ల కొద్దోగొప్పో సుఖం లభిస్తుందని కొందరంటారు. మంచివస్త్రాలు కావాలి. కమ్మని భోజనం కావాలి. ఇది లభిస్తే తృప్తి. కోరిక కొంత శమిస్తుంది ఈ ఆలోచనతో మనిషి ప్రయత్నిస్తాడు. కాని అనుభవం ఏమంటున్నది? తృప్తి సుతరాంలేదు. అనుభవించినకొద్దీ అనుభవించాలనే కోరిక బలపడు తున్నది. కనుక కోరిక, కామన మిగిలిఉంటే సుఖమెలా లభిస్తుంది? కోరికలు తీర్చుకునే ప్రయత్నంలో సుఖమేమీ లేకపోతే. సుఖం ఎక్కడ ఉన్నదని మనిషి ఆలోచిస్తాడు సుఖం లభించాలి. అదే ఆదర్శం. ఆ సుఖజీవనం లభించందే ఎవరూ ఉండలేదు

ఈ విషయంలో సుఖమనేది మన 'లోపలే' ఉన్నదని భారతీయ మనీషుల అభిమతం. మన 'లోపలి' ఈ సుఖాన్ని బైటికి కన్పించే సాధ నాల మిషతో అనుభవిస్తుంటాం. అసలు సుఖమనేది బైట దొరికేవస్తువు కాదు. అది 'లోపలి' వస్తువు. బైటివస్తువులు సుఖాన్ని ఇవ్వవు అవి నిమిత్తమాత్రములు. ఈ విషయంలో ఎక్కువగా వివరించను నాకు

తెలిసిన ఒక యోగి ఉన్నారు. 'బైటవస్తువుల నిమిత్తంగా మనిషి సుఖించినా, ఆ సుఖంలోకూడా, ఆసుఖించేక్షణంలో, ఆ సుఖానికి నిమిత్తా లైన వస్తువులను విస్మరిస్తాడు. అంటే తన 'లోపలి' సుఖాన్నే అనుభవిస్తాడు' అని ఆయన అన్నారు. మన జీవనం సుఖమయం. సుఖమే జీవనస్వరూపం. అందుకే నిమిత్తంలేని సుఖమే శాశ్వతమైనది. అయితే దీన్ని పొందడానికేమిచేయాలి? మన పూర్వులు ఎంతో అనుభవంతో తీవ్రంగా మననంచేసి, మనకు కొన్ని మార్గదర్శకంగా ఉండే విషయాలను చెప్పారు. అస్వస్థంగా, అస్థిరంగా ఉన్న మనస్సుకు ఆనందం లేదనేది నిర్వివాదమని అన్నారు. అంటే మనసు శాంతంగా ఉండాలి. మనసులో పెల్లుబికే పొందులను విగ్రహించుకోవాలి. నీటిలో అలలువస్తే ఏమీ కన్పించదు. మన ప్రతిబింబంకూడా కన్పించదు. నీరు కదలికలేకుండా ఉంటే అన్నీ కన్పిస్తాయి. మనస్సు స్థిరంగాఉంటే మూలస్వరూపాన్ని చూడవచ్చు. అస్థిరమైన మనస్సుకు సుఖానుభూతి లభించదు; దాని స్వరూపంకూడా కన్పించదు. మనసునందుకే నిశ్చలంగా, తరంగరహితంగా, శాంతంగా ఉంచుకోవాలి. అప్పుడే బాహ్యవస్తువుల ప్రమేయం లేకుండానే సుఖానుభూతి కలిగి కృతార్థులమవుతాం మానవ సుఖాన్వేషణ విషయంగా మన పూర్వులు స్వానుభవంతో చెప్పిందిది.

ఈ విధంగానే ఆలోచించాలి. ప్రగతిశీలదేశాలని ప్రపంచంలో వ్యవహరింపబడుతూన్న దేశాలలో పోటీ, అసూయ, ద్వేషం, కటుత్వం, ఇతరుల సుఖాన్నిచూచి శత్రుత్వాన్ని పెంచుకోడమనే లక్షణాలు కన్పిస్తున్నాయి ఈ గుణాలలో మనిషి మనస్సుకు శాంతి స్థైర్యాలను ఇచ్చే అవకాశం ఉన్నదా? ఈ గుణాలలో మనిషి మనస్సును శాంతింపచేసుకునే గుణాన్ని ఆపే ప్రవృత్తి ఉన్నది ఈ స్థితి ఉంటే మనస్సు శాంతించదు. కోరికల తుఫాను ఆగదు మరి సుఖమెలా లభిస్తుంది? కనుకనే 'ఇతరుల సుఖాన్నిజూచి అసూయచెందకు, అభినందించు' అని ఈదేశంలో

నేర్పారు. 'నీవుకూడా పైకి వచ్చేప్రయత్నంచేయి. కాని అసూయా ద్వేషాలను, పోటీ మన తత్వాన్ని దగ్గరకు రానీయకు' అని నేర్పారు. లేకపోతే ఇతరులను పీడించి సంతోషించే లక్షణం అబ్బుతుంది. దీనితో మనశ్శాంతి దొరకదు. మనస్సును శాంతంగా సంతోషంగా ఉంచుకోవాలంటే, పోటీలతో సతమతమవుతూన్న నేటి ప్రగతిశీల దేశాలనబడే వాటి జీవనాన్నిగురించి గంభీరంగా ఆలోచించాలి. మన మౌలిక సిద్ధాంతాన్ని విడువకుండా ఆయాదేశాలనుండి సుఖసాధనాల భావాలను ఎంతవరకు గ్రహించవచ్చో ఆలోచించాలి. మనిషి శరీరధారి; సందేహంలేదు. శరీరానికి కావలసిన సుఖసాధనాలు ఎంతవరకు ఏవిధంగా స్వీకరించాలనే విషయంలో గ్రుడ్డిగా ఇతరులను అనుకరిస్తే లాభం కలుగదు. ఎదుటివాని దుఃఖానికి మనసు కరగాలని, అలా కరుణతో, ఆ దుఃఖాన్ని తొలగించడానికి ప్రయత్నించాలనే తలంపు మనలో ఉండాలని మన పూర్వులు చెప్పారు. దీనివల్ల ఒకవిధమైన తృప్తి, సుఖం ఇచ్చే నిశ్చలస్థితి లభిస్తుంది ఇది పోటీవల్ల రాదు. పోటీకి దూరంగాఉండడమే మంచిది

పర్మిసివ్ సొసైటీ (స్వేచ్ఛాచార సమాజం) అన్నివిధాల నష్టదాయకమే. ఇందులో అనుమానంలేదు నియమనిగ్రహాలు లేనిస్థితిని గురించి పురాణాల్లోకూడా వర్ణించారు. అతిప్రాచీనంలో నియమాలు ఏవీ లేవు. అప్పుడు అనుభవంమీాదట ఏనియమాలూ లేనందున అనాచారం పెరుగుతూన్నదని గుర్తించి, నియమాలు రచించారు. ప్రతిమనిషీ వాటి ననుసరించి నడుచుకోవాలని నిశ్చయించుకున్నారు కనుక స్వేచ్ఛా సమాజంలో అనాచారం పెరుగుతుందనేది ప్రాచీనమైన అనుభవమే. తేకాక, దీనితో మనిషికి మనిషి శత్రువై, జీవితం నాశనమవుతుందని కా గ్రహించారు. ఆ అనుభవాలనుగురించి ఎవరేమన్నా, గత యాభై ఏ ఏండ్ల అనుభవం ఆసరాగా మానవజీవనాన్ని నడిపించబూనడం

పొరపాటు మనిషికి ఏది చెడూ ఏది మేలు అనే విషయాన్ని అనుభవ జ్ఞానంతోటే నిర్ణయించాలి.

## నిగ్రహంతో అనుభవం

ఈ విషయంలో అంతులేని భోగాసక్తివల్ల, ఆ కోరికల తృప్తి కోసం పోటీపడి పరుగెత్తడంవల్లా సుఖం లభించదని మనదేశం భావించింది. కనుక జీవనంలో నిగ్రహం తెచ్చుకోవాలన్నారు. వ్యక్తికి, సమాజానికి కూడా ఈ నిగ్రహం అవసరం. సమాజంలో నిగ్రహగుణాన్ని తీసుకొని రావడం ఎంత కష్టమో గ్రహించవచ్చు. అందుకుగాను చతుర్విధపురుషార్థాలను రూపించారు. ఈ నాలుగు పురుషార్థాలను నియమించింది నిగ్రహంతో జీవితాన్ని నడిపేందుకే. వ్యక్తిగా – సమాజంగా రెండు రకాల కర్తవ్యాలనుగురించి ఆలోచించాలి. ధర్మంతో రెంటినీగ్రహించాలి. ఇలా ధర్మబద్ధమగు జీవనంతో అర్థకామాలను సాధించాలి. అంటే భోగం, ప్రభుత్వం, ధనం, సంపద, సుఖవిలాసాలు మొదలగువాని సాధనాలన్నీ ధర్మబద్ధంగానే ఉండాలి. ఈ కట్టుబాటు పూర్తిగా ఉండేందుకు మన 'లోపలి' మూలకారణమగు సుఖాన్ని దర్శించుకోవాలనే మోక్షపరమగు కోరిక ఎల్లప్పుడూ ప్రబలంగా ఉండాలి. ఈ కోరికనే – అనగా నాల్గవ పురుషార్థాన్ని–మన పూర్వులు మనముందుంచారు. ఈ నాల్గవ పురుషార్థాన్ని మీరు ఏ పేరపిలిచినా ఫరవాలేదు. దీనిని మనముందు ఉంచడానికి, మన మూల ప్రకృతిని గ్రహించాలనే కోరిక నిరంతరం ఉండాలనేదే కారణం. మొదటి పురుషార్థమూ – నాల్గవపురుషార్థమూ ఈ రెంటిమధ్య, అదుపులో జీవనం అంతా నడవాలి. రెండుగట్లమధ్య నదిప్రవహిస్తేనే ఆ నీరు సక్రమంగా పనిలోకివచ్చేది. అదే ఇక్కడ జరగాలి. గట్లు కోసి ప్రవహించే నది

విధ్వంసాన్ని సృష్టిస్తుంది. ఆ నీరుకూడా పనికిరాదు. కనుక భోగమనే నది రెండు గట్లమధ్య అదుపుతో ప్రవహించడమే సుఖదాయకం. ఈ మొదటి, నాల్గవ పురుషార్థాలమధ్య జీవన నదిని నిర్దేశించి మనిషి వ్యక్తి గతంగా, సామాజికంగా, ఎన్ని ఐహికసుఖసంపదలు కోరవచ్చునో, అన్నిటినిగురించి ఆలోచించుకోవాలి. ఈ రెండు పురుషార్థాలుండడం తప్పనిసరి అనే భావనతోటే మన సమాజ నిర్మాణం జరిగింది.

పైపద్ధతే మనిషికి సుఖాన్ని ఇవ్వగలదని నావిశ్వాసం. పోటీ పోరాటాన్ని ప్రసవిస్తుంది. ఈపోటీవల్ల సమాజంలో ఏర్పడే చెడును ఆపి, అన్నివిధాల జీవన సౌకర్యాలను అనుభవిస్తూనే, వాటిని అదుపులో ఉంచుకుంటూ, జీవితానికి అంతిమమైన లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకొని నడుస్తుండే మనిషి నిజంగా సుఖిస్తాడు; వ్యక్తికీ, సమాజానికీ నిజమైన సుఖం లభిస్తుంది.

## సంఘకార్య ప్రయోజనం

ఈ సమాజ వ్యవస్థ శుద్ధము, అనుభవసిద్ధము నైనది చరితార్థమైనది. వేలకొలది ఏండ్లు ఆచరింపబడింది. ఇది మనముందు ఉన్న వ్యవస్థ. మన యీ వ్యవస్థ ప్రపంచానికి ఏదైనా గొప్పదనాన్ని యివ్వగలదా? ఆ గొప్పదనమేదైనా ఉంటే, ముందుగా మనలో దాన్ని ఆవిష్కరించుకోడానికి పురోగమించాలా, వద్దా? ఆలోచించండి.

మనదేశంలో ఆవిష్కరించుకున్న ఈ ఆదర్శం శ్రేష్ఠమైనదని, మానవ కళ్యాణాన్ని చేకూర్చేదని, విశ్వజనీనమని, సమస్త మానవజాతికి సరియగు సుఖాన్ని ప్రసాదించగల శక్తి కల్గిందనీ, కనుక ఈ వ్యవస్థకు ముందు మన సమాజంలో పూర్తిగా అభివ్యక్తీకరింపచేయాలని, దానికై యత్నం జరగాలని భావించినట్లయితే రాష్ట్రీయ స్వయంసేవక సంఘ

ఉపయోగాన్ని మనం స్పష్టీకరించగలం; సంఘ భావాలను ప్రపంచంలో చాటగలం.

ఇవన్నీ పాతకాలపు ముచ్చట్లనిపిస్తే (ప్రస్తుతం హిందువును రూఢి వాది, ఛాందసుడూ అంటున్నారు.) వీటినికాదని, నేటియుగంలో కన్పించే ఐశ్వర్యానికి పోటీ, ప్రభుత్వశక్తికై పోటీ మొదలగువాటితో నడిచే పద్ధతినే అనుసరించి, మనంకూడా పరుగులు తీస్తుండాలనే కోరిక ఉంటే, 'సంఘం' గురించి ఆలోచించడము కూడా అసాధ్యమవుతుంది. కొత్తరకంగా నేడనేకులకు అలవాటైనట్లు సంఘాన్ని ఒక రాజకీయ ఉపకరణం (political instrument) గా భావిస్తే, రోజుకో మార్పు తెచ్చుకోక తప్పదు. అప్పుడు సంఘ రూపాన్నే పూర్తిగా మార్చివేయవలసివస్తుంది. సిద్ధాంత చింతనం కూడా పూర్తిగా మార్చాలి అవన్నీ తప్పవు. ఇవన్నీ పాతవి అని విడిచిపెడితే, మనం శీలమని దేనిని అంటున్నామో అది అనవసరం-వృధా. వాటివల్ల లాభంకూడా లేదు. మనకేపద్ధతిలో సుఖ విలాసాలు, ఐశ్వర్యం, ప్రభుత్వమూ లాభిస్తాయో వాటిని గురించే ఆలో చించాలి. అంతేకాదు. మనం ''హిందూసంఘటన'', అని వ్యవహరిస్తున్న విషయాన్ని కూడా త్యజించాల్సివస్తుంది. ఎందుకంటే, హిందూశబ్దంలో ఉన్న జీవన నిర్మాణ భావనతో వ్యక్తికి సుఖసంపదల సంపాదించే అను భవ ఫలితాలను, అండగా చేసుకొని నెలకొన్న వ్యవస్థలూ, విశ్వాసాలూ వందలాది సంవత్సరాల పెనుతుపానుల తాకిడికి తట్టుకొని సార్థకంగా నిలిచి నేటి జగత్తుకు శాశ్వత సుఖాన్నివ్వగల ఏకైక మార్గాన్నిస్తున్నవి. కనుక ఆ జీవన నిర్మాణ భావనను ప్రేరేపించే చైతన్య తత్వాన్ని గ్రహించందే సమాజ సంఘటనను గురించి ఆలోచించడం అర్థరహితం. సమాజ సంఘటన చేయాలని ఉంటే మానవ జీవనాన్ని సమగ్రంగా ఆలో చించాలి. ఈధోరణిలో ఆలోచించడమనేది, ప్రాచీనం నుండి వస్తున్న మనపద్ధతితోనే ఉన్నది తప్ప మరెక్కడా లేదు.

# ప్రజాస్వామ్య స్వరూపం

నేటి రాజకీయాలంటే నాకు ఆసక్తి ఎన్నడూ లేదు. ముఖ్యంగా రాజకీయాలపేర నేడు జరుగుతూన్న వ్యవహారాలు నాలాంటివాళ్ళకు అర్థం గావడంకూడా కష్టమే. ఓట్ల రాజకీయాలలో అసాధ్యమేమీలేదు. ప్రతిదీ దేశంకొరకేనంటూ, వ్యవహారంలో దేశహితాన్ని ప్రక్కకునెట్టి స్వార్థాలను రెచ్చగొట్టే రకరకాల ప్రయత్నాలు సాగుతున్నాయి. ప్రస్తుతం భాషా వాదం ప్రబలంగా ఉన్నది. దీనివల్ల అప్పుడప్పుడు అరిష్టంకూడావస్తున్నది. భాషపేరిట వేర్వేరు రాష్ట్రాలు, ధ్వజాలు, సేనలు నిర్మాణమయ్యేంతదాకా వచ్చింది. వీటిని సమర్థించడానికి యుక్తులు వెదుకుతున్నారు. ఈవేర్పాటు ఈ వైవిధ్యం నేటిదా ? పూర్వంకూడా రాజకీయంగా.భారతదేశం ఎప్పుడూ ఒకటిగాలేదు. ఎన్నోరాజ్యాలు ఉండేవి. ఎప్పుడైనా ఒక సామ్రాజ్యం ఏర్పడ్డా అదికూడా బలహీనంగానే ఉండేది. చిన్నచిన్నరాజ్యాలు చాలా ఉండేవి. స్వతంత్రంగా ఉండేవి. కనుక నేడుమాత్రం వేర్వేరు స్వతంత్ర రాజ్యాలుంటే తప్పేమిటని తర్కిస్తున్నారు. ఈ భావాలను రెచ్చగొడు తున్నారు రాజకీయాల్లో పనిచేసేవాళ్ళకు ఫలితాలు వెంటనే కన్పించాలి. అందుచేత దీనివల్ల భవిష్యత్తులో ఎలా పరిణమిస్తుందీ ఆలోచించరు. ఈ విషయాలను తనకొరకు ఎలా ఉపయోగించుకోవాలి అనే ఆలోచిస్తారు. వీటి అన్నిటికారణాన దేశంలో విచ్ఛిన్నభావాలు ప్రబలుతున్నాయి, ధర్మ' సంస్కృతుల పట్టుతప్పిన ఈరోజుల్లో, ఈ విచ్ఛిన్నస్థితి ఇంకా పెరుగు తుందేమోననే భయం సహజంగా కలుగుతుంది.

భాషనుబట్టి ఇన్ని ప్రాంతాలు చేయడం తగదని మొదటినుంచీ మనం అంటూనేఉన్నాం. దేశం అంతటా చక్కని, స్థిరమైన రాజ్యాన్ని నిర్మాణం చేయడానికి చిన్నవైనా, పెద్దవైనా, ఒక భాష మాటాడే ప్రజలను

కలిపైనా, పలుభాషలతోనైనా సరే, భాషావివాదాన్ని విడిచి, హితకరమైన విధంగా ప్రాంతాల ఏర్పాటు జరగాలి. అన్నిభాషలనూ అలా ఏర్పడ్డ ప్రాంతాల్లో వికసింపచేయవచ్చు పరిపాలనా సౌలభ్యందృష్ట్యా జిల్లాలను ఏవిధంగా ఏర్పరుస్తామో, అలానే ప్రాంతాలను ఏర్పాటు చేయాలి.

## ప్రజాస్వామ్య వ్యవస్థ

అలాగే దేశమంతటికీ ప్రజాస్వామ్యాన్ని స్వీకరించాం. ప్రపంచంలో కన్పించే పద్ధతుల్లో ఈ పద్ధతిలో తక్కువ దోషాలున్నవని అనుకున్నారు. ఈ వ్యవస్థలో ప్రజలందరికీ ప్రాతినిధ్యం లభిస్తుందన్నారు. కాని ఈ వ్యవస్థ సరిగా నడవాలంటే, ప్రతివ్యక్తి బాగా చదువుకున్నవాడై ఉండాలి. చదువుకుంటే చాలదు. ప్రతివ్యక్తికీ, అర్థశాస్త్రం, రాజకీయ శాస్త్రం, అంతర్జాతీయ సంబంధాల జ్ఞానం మొదలగు అన్ని విషయాలూ బాగా తెలిసి ఉండాలి. ఇలాంటి విద్యావంతమైన, విషయ జ్ఞానమున్న సమాజమే తనకు తగిన ప్రతినిధులను ఎన్నుకోగలుగుతుంది. లేనిచో, ప్రజలు చదువు, విజ్ఞానం లేకుండా ఉంటే, ఏదో స్వార్థానికి, లోభానికి, ఆశకూ, లొంగిపోయి అయోగ్యులను తమకు ప్రతినిధులుగా ఎన్నుకోడం, అయిదేండ్ల వరకు అయ్యో అని ఏడుస్తూ కూర్చోడం తప్పదు. చదువూ, చైతన్యమూ గల ఓటర్లు లేనిచో ప్రజాస్వామ్యానికి ఈగతి తప్పదు; సరియైన ప్రతినిధులు ఎన్నిక కారు. ఇలాంటివే ఇంకా చెడు పరిణామాలు దాపురిస్తాయి. చివరకు మౌలికమైన ప్రజాస్వామ్య భావనే మరుగున పడుతుంది. ఎన్నో చిత్రమైన దృష్టాంతాలు కన్పిస్తాయి. రైతులకు, వ్యవసాయ జ్ఞానం కూడా లేని డాక్టరో, వకీలో ప్రతినిధిగా వస్తాడు. ఎన్నికల్లో గెలిచే కళ నేర్వడం తప్ప మరేమీ ఎరుగని ఒక వర్గం ఈవిధంగా తయారు అవుతుంది. ఒక ఉదాహరణ చెప్తాను. పాకిస్థాన్‌తో యుద్ధం

జరుగుతూన్న రోజులు. నిరుటి విషయం కాదు. 1965 నాటిది. అప్పుడు సరిహద్దులకు సమీపంగా ఉన్న నీటిపారుదల కాలువలు ఎండిపోయినాయి. కాలువలలోకి నీరు వదలలేదు సరిహద్దు కావల పాకిస్థాన్ భాగంలో కాలువలో నీరు పూర్తిగా నిండి ఉన్నది. ఇటు నీరు లేనందున వ్యవసాయం బాగా దెబ్బతిన్నది. అప్పట్లో రక్షణ శాఖకు చెందిన ఒక ఉపమంత్రిని కలవడం తటస్థించింది. 'యుద్ధం ఎన్నాళ్ళు నడుస్తుందో చెప్పలేముకదా! నీరు వదలకపోతే పంటలు పూర్తిగా చెడిపోవా? ధాన్యం కొరత ఏర్పడదా? దాంతో జనం నిరాశ్రయులవుతారు. ఇటూ, అటూ పోవలసివస్తుంది దాంతో మనం అంతరంగికంగా చిక్కులకు లోనుకావలసి వస్తుంది' అని నేను అన్నాను ఆ పెద్దమనిషి గంభీరంగా 'కాల్వలలో నీరు ఉంటే మెరుస్తుంది. పైన తిరిగే శత్రు విమానాల కది కన్పిస్తుంది. అందుకే తెలిసే నీరు ఆపాం' అన్నాడు. 'మరి అటు శత్రుదేశపు కాలవల్లో నీరు ఉన్నది కదా! వారికి భయంలేదా?' అని నేనడిగాను దాని కతడు సమాధానం ఇవ్వలేదు. కొన్నాళ్ళకు మరో ఉపమంత్రిని కలిసినప్పుడు ఈవిషయమంతా చెప్పి, నిజమేనా అని అడిగితే అతడు ''తప్పు; అతనికి ఈ విషయంలో ఏమీ తెలియ''దని చెప్పాడు. చెప్పవచ్చిందేమంటే, విషయ పరిజ్ఞానం లేనివాడు, ఆయా విషయాలకు అధికారిగా కూర్చుంటాడు. వ్యవసాయం తెలియనివాడు, వ్యవసాయానికి ప్రతినిధి, పరిశ్రమల జ్ఞానం లేనివాడు పరిశ్రమల ప్రతినిధి, ఇలా విషయ పరిజ్ఞానం లేనివారి కూడలి ఏర్పడుతున్నది.

తెలిసిన వాళ్ళు, 'మేమేమిచేయగలం? పైనుంచి ఎలా ఆదేశంవస్తే అలా చేయవలసినవాళ్ళం' అని అంటారు. మరో ఉదాహరణ. ఒక రైల్వే ఇంజనీర్ నన్ను కలిసాడు. అతడు వంతెనల నిర్మాణంలో నిపుణుడు. బీహార్‌లో వరదలవల్ల ప్రతిఏటా చాలా హాని కల్గుతూంటుంది.

నేనడిగాను 'ఉత్తరాన చాలా నదులు ప్రవహిస్తాయని మీకు తెలుసు కదా! ఎన్నో జల ప్రవాహాలు ఉన్నాయికదా! ఇంత జలం సరిగా ప్రవహించేటందుకు వీలుగా యోజన చేసి, పెద్ద వంతెనలు నిర్మాణం ఎందుకు చేయరు?' అతడు, 'నిజమే, ఈ పనులన్నీ ఆలోచించి చేయడంలేదు. అందుకే నీరు నిలుస్తుం'దన్నాడు. 'మరి ఈ వరదలవల్ల ఏటా జరుగుతూన్న నష్టానికి మీరు బాధ్యులుకారా' అని అడిగాను. దానికాతడు. 'ఏమిచేసేదండి! మా మంత్రిగారికి ఏమీతెలియదు. వారు చెప్పినట్లు, వారు చేసిన ప్రణాళికనుబట్టి నడుచుకుంటాం' అన్నాడు.

ప్రజాస్వామ్యంలో ఇలాంటి బాధలు ఉన్నాయి. మరిమార్గం ఏర్పరుచుకోడం ఎట్లా? జనాభాను బట్టి నియోజకవర్గాలవారీ ప్రతినిధుల నెన్నుకోడంతోపాటు, వృత్తిఉద్యోగాల ప్రతినిధులనుకూడా ఎన్నుకోవాలి. వ్యవసాయ క్షేత్రమైతే రైతుప్రతినిధులను ఎన్నుకోవాలి. ఇట్లా అన్ని వృత్తి ఉద్యోగాలను వర్గీకరణం చేసి ప్రతినిధుల నెన్నుకోవాలి. ఇంగ్లీషులో దీన్ని 'ఫంక్షనల్ రిప్రజంటేషన్' (వృత్తిప్రాతినిధ్యం) అంటారు. ప్రపంచంలో కొన్నిచోట్లఇది అమలులో ఉన్నది. ఇలా చేసినట్లయితే, తెలియని గుంపుతో సభ ఏర్పడి, ప్రభుత్వాలేర్పడేకంటే, కొందరైనా తెలిసినవాళ్ళు ఉండడానికి వీలవుతుంది. అవసరమైనప్పుడు వీళ్ళు తమ మౌలిక భావాలను ప్రకటించగల్గుతారు.

## పంచాయతీలు - వికేంద్రీకరణ

ఈ పద్ధతి మన దేశానికి తెలిసినది. పూర్వం మనదేశంలో గ్రామ పంచాయతీ వ్యవస్థ ఉండేది. ఈ పంచాయతీలే క్రమంగా వికసించి రాజుకు అష్ట ప్రధాన సమితిగా సముచితమైన సలహాలు ఇస్తుండేది. ఈ పంచాయతీలు కూడా వృత్తి ఉద్యోగాలనుబట్టే ఏర్పడేవి. పూర్వం నేటిలా జీవనం జటిలంగా ఉండేదికాదు. సామాన్యంగా ఉండేది. నాల్గు వృత్తులను

ప్రధానంగా స్వీకరించేవారు మననము, అధ్యయన అధ్యాపనాలతో, ధర్మ ప్రచారము చేసేవాళ్ళది ఒకపని. రెండవది రాజ్య సంరక్షణచేసే బాధ్యత స్వీకరించినవారిది. మూడవది వాణిజ్యం. నాల్గవది వ్యవసాయం మొదలగు మిగతా వృత్తులవారిపని. అయిదవవారిది కొండల్లో అడవుల్లో ఉంటూ, వేటాడి జీవించేవారిపని. ఇలా నాల్గువర్గాలవారి ప్రతినిధులు నల్గురు, అయిదవవారు నిషాదులని వ్యవహరింపబడిన వారి ప్రతినిధి. ఇలా అయిదుగురూ కలసి సమాజానికంతటికి ప్రాతినిధ్యం వహిస్తుండే వారు.

ఈనాడు కూడా 'పంచాయతీ రాజ్య'మని అంటూనే ఉన్నారు. కాని లక్ష్యశుద్ధి లేనందున, వ్యవస్థలలో వికృతి ఏర్పడింది. ఒక పెద్ద నాయకుడు నాతో 'ఈ పంచాయతీ వ్యవస్థ చివరకు పెద్ద తగాదాలకు దారి తీస్తుం'దని అన్నాడు. ఆయనే పాతమాటలు పోనీయండి. నేడు పార్టీ తత్వం, కులతత్వం, వీటితో పోట్లాటతత్వం నలువైపులా ప్రబలుతూన్నది. గ్రామాలలో ఇది ఇంకా ఎక్కువగా ఉన్నది. ఈస్థితిలో గ్రామాలలో పేరు పొందిన గుండాలు పంచాయతీలలో సభ్యులుగా ఎన్నికై వస్తారు. అందరినీ కొట్టి, భయపెట్టి పంచాయతులలోకి దూకుతారు. ఈవిధంగా ప్రతి గ్రామంలో పోట్లాటలు ప్రారంభమవుతాయి' అని అన్నాడు. ఇది ఎంత వాస్తవమో గుర్తించవచ్చు. అయినా ఈదోషాన్ని తొలగించి ప్రయోగం చేయాల్సిన అవసరం ఉన్నది. మంచివారు సద్భావం గలవారు, నల్గురికీ ప్రేమపాత్రులు అయిన వ్యక్తులు తమ తమ వృత్తులకు ప్రతినిధులుగా ఎన్నికై కూడడం, వారి అనుభవాల సారంతో నిర్ణయాలు తీసుకొని పరిపాలనను ప్రభుత్వాన్ని నిర్వహించడం చాలమంచిది. గ్రామాలు అదుపులో ఉండి, రక్షింపబడుతాయి ఈ ప్రయత్నాన్ని ఫలింపచేసి, దీని క్షేత్ర పరిమితిని పెంచవచ్చు. దేశమంతటికీ వ్యవస్థ ఏర్పరిచేందుకు ఇలాంటి పునాది లాభదాయకమవుతుంది. ఈ పునాది గట్టిపరిచేందుకు

అనువైన ఎన్నికల యంత్రాంగాన్ని స్వీకరించాలి. రాజ్యాంగం కూడ ఈ పునాదిమీదే రచింపబడాలి. ఈదిశలో గట్టి ప్రయత్నం జరిగితే, రాజకీయ వ్యవస్థలో కొంత ఎక్కువ సూత్రబద్ధతా, అందరి అవసరాలను గుర్తించి పరస్పరం ఎక్కువ సమన్వయాన్ని సాధించే బుద్ధి బలపడ వచ్చు. ఇది ప్రయోగం చేయతగ్గ విషయమనేది మాత్రం వాస్తవం. ప్రయోగమేదైనా సంపూర్ణ స్థితిని పొందదు. అందుకే ఎక్కువలాభం, తక్కువనష్టం కలిగే పద్ధతిని వరించడమే హితకరమనే భావంతోనే ఈ ప్రయోగం జరగాలి.

ఆర్థిక విధానాన్ని గురించి మరోభావంకూడా నేడు చాల ప్రచారంలో ఉన్నది. మన భారతీయ అర్థశాస్త్రం అంటే కేవలం ఆర్థికశాస్త్రం కాదు. అర్థశాస్త్రాన్ని నీతిశాస్త్రమని అంటారు. నీతిఅంటే నేడు కేవలం రాజనీతి అనిమాత్రమే భావిస్తున్నారు. మనదేశంలో ఆ నీతిశాస్త్రంలో అర్థ శాస్త్రాన్నికూడా చేర్చారు. కాని నేడు ఆర్థిక విధానంపట్ల మాత్రమే ఎక్కువగా శ్రద్ధచూపుతున్నారు. ఇందులో సమాజవాదాన్ని పేర్కొనడం జరుగుతున్నది. ఈ సమాజవాదం బహుముఖాలుగా వివరింపబడుతున్నది. ఈ అనేక వ్యాఖ్యలవల్ల అసలు ఇది ప్రతిపాదించే మూలవ్యవస్థే అర్థం కాకుండా పోతున్నది. గిల్డ్ సోషలిజం, అనార్కిజం, సిండికలిజం, కమ్యూనిజం మొదలగునవి ఎన్నో ఉన్నాయి. ఏదెలాఉన్నా సమాజవాద శబ్దానికి బానిసలం కాకుండా మన మౌలికమైన భారతీయ సిద్ధాంతాన్ని ఆధారంగా గ్రహించి, ఆయా ఆర్థిక విధానాలను గురించి మనం ఆలోచించుకోవచ్చు. అందులో ఆలోచించతగ్గదేమైనా ఉంటే, మనసిద్ధాంతాలతో సమన్వయించుకొని స్వీకరించ గలిగితే తప్పక స్వీకరించాలి. తప్పులేదు.

ముక్కు సూటిగా స్వతంత్రంగా ఆలోచించి చూస్తే సోషలిజం అనే సిద్ధాంతంలో ఆలోచించతగ్గ మౌలిక విషయం 'సంపదల వికేంద్రీ

కరణ' మాత్రమే. ఈ వికేంద్రీకరణం న్యాయంగా జరగాలంటారు. ఈ వాదాన్ని గురించి పొటమరిస్తున్న వివాదాలన్నీ ఈ వికేంద్రీకరణం న్యాయంగా జరిపించే అధికారం ఎవరికి యివ్వాలనే విషయంలోనే వస్తున్నవి. ఈ వికేంద్రీకరణ నిమిత్తం ముందుగా కేంద్రీకరణ చాలా అవసరమని నేడు గట్టిగా ప్రతిపాదన జరుగుతున్నది, అనేక కేంద్రాలుగాకాక, ప్రభుత్వం చేతికే అన్నీ అప్పగించాలంటున్నారు. ప్రభుత్వ శక్తినే ఏకైక మహత్తర పూర్ణమైన కేంద్రంగా గుర్తించాలని అంటున్నారు ప్రభుత్వానికే అన్నీ అప్పగించాలనే ఈ వాదాన్ని నేడు మన దేశంలో విరివిగా ప్రచారం చేస్తున్నారు. ప్రభుత్వం సంపదనంతటినీ తన చేతుల్లోకి తీసుకోవాలని ప్రచారం జరుగుతున్నది. సంపదలనుత్పత్తి చేసే సాధనాలన్నిటిమీద కూడా ప్రభుత్వాధికారమే ఏకైకంగా ఉండాలంటున్నారు. ఇలా జరిగితే ప్రభుత్వమొక్కటే శక్తి కేంద్రమై మిగతా సమాజం ప్రభుత్వ ఛత్రఛాయలో బానిసగా, నౌకరుగా జీవించాల్సివస్తుంది. ప్రభుత్వం ఎంత, ఏవిధంగా ఎప్పుడు పంచితే అపుడు మిగతా జనం స్వీకరించాల్సివస్తుంది. ప్రభుత్వం ఏ కనీసవేతనం నిర్ణయిస్తుందో అంతతోటే సమాజం తృప్తి చెందినదవాలి.

కాని ఈ విషయంలో, విదేశాలలో ఎన్ని ప్రయోగాలు జరిగాయో అవన్నీ విఫలమే అయినాయి. ఒక విషయానికి మాత్రం వారిని పొగడక తప్పదు. వాళ్లు సాహసంతో ఒక ప్రయోగంచేశారు. ఎప్పుడైతే ప్రయోగం ఫలించలేదో అంతే సాహసంతో తమ ప్రయోగాలను మార్చుకున్నారు. పట్టుదలతో ప్రయోగం చేయగల ఈ సాహస గుణానికి వారిని శ్లాఘించక తప్పదు. అంటె తు చ. తప్పకుండా మనం వారి ప్రయోగాలను అనుకరించాలనికాదు. ప్రయోగ సందర్భంగా ఇండ్లలో వంటలు ఉండవనీ, వంట అంతా సామూహికంగా తయారవుతుందని వారు ప్రకటించారు. ప్రతిమనిషీ పని చేసిన తర్వాత, సార్వజనిక భోజనశాలల్లోకి పోయి తమకు కావల్సినంత తినవచ్చునని ప్రకటించారు, కడుపునిండేంత భోజనం ప్రతిమనిషికీ

అక్కడ దొరుకుతుంది. పిల్లలు తల్లిదండ్రులదగ్గర ఉండకూడదనికూడ ప్రయత్నించారు. అందరినీ ఒకచోట పెంచటం జరుగుతుంది. నిర్ణీత మైన వేళకు తల్లి పోయి తన సంతానానికి పాలు యిచ్చిరావాలి. మరైతే వేళకు ఆతల్లికి తన సంతానం కన్పింస్తుందా. అదీ అవసరం లేదు. చేతి కందిన శిశువుకు పాలు ఇవ్వవచ్చు. అంతే. కాని మనిషి మిషనుకాదని వారికి తొందరగానే తెలిసింది. ప్రతివ్యక్తికీ ఒక్కొక్క ప్రత్యేక ప్రకృతి ఉంటుంది. వారివారి అభిరుచులు వేర్వేరుగా ఉంటాయి. దీనివల్ల అసంతృప్తి పెరిగింది. తప్పునిసరిగా మార్పుచేయవలసి వచ్చింది. ఇలా ఎన్నో ప్రయో గాలు జరిగాయి తప్పు అని గుర్తించిన వెంటనే వాటిని మార్చుకోవడం కూడ జరిగింది. అందుకనే ప్రయోగం చేయడంలో వాళ్లు చూపినసాహసానికి ధన్యవాదాలు చెప్పాలి. ప్రయోగాలు మనం కూడ చేయాలి. కాని వాళ్లు చేసిన వాటినే అనుకరిస్తూ పోవడం మనకు క్షేమదాయకంకాదు. ఇది గుర్తించాలి.

## స్వతంత్రంగా ఆలోచించాలి

కనుక మిగిలేది సంపదల వికేంద్రీకరణం జరగాలనే విషయం. దీన్నిగురించి మనం మన ధోరణిలోనే ఆలోచించాలి.

కాని చిత్రమేమంటే నేడు మన పద్ధతిలో మనం ఆలోచించేందుకు సిద్ధంగా లేము. బైటనుండి ఏ తయారుసరకు దొరికితే దాన్ని నెమరు వేయడం, పొగడుతూండడం అలవాటైంది. ''ప్రపంచంలో కన్పించే సిద్ధాంతాలన్నిటినీ తరచి చూస్తాము. కాని మాకు మూలమైన రాష్ట్రీయ జిజ్ఞాసను బట్టే మా మార్గాన్ని నిశ్చయించుకుంటాము' అని అనగలిగే సాహసం, స్వాభిమానం మనలో ఉండాలి. ఈ వివిధ జీవన పక్షాలను గురించి మన రాష్ట్రీయ అవసరాలకు అనుగుణంగా మనదేశంలో

ఆలోచన జరుగక పోలేదు. ఉదాహరణకు మహాత్మా గాంధీ సంపదల వికేంద్రీకరణానికి 'ట్రస్టీ షిప్ పద్ధతి'ని ప్రతిపాదించారు. భారతీయ పరంపరనుండి, జీవన దర్శనాలనుండి తాము పొందిన అనుభవజ్ఞానం, అనుభూతి ఆధారంగా వారీమార్గాన్ని సూచించారు. కాని మన సమాజవాద సోదరులు మహాత్మాజీ బూర్జువా అన్నారు. బూర్జువా అంటే అర్థమేమిటి? ఏమో! నేడీశబ్దం తిట్టుగా వాడబడుతున్నది. భారతీయ పద్ధతిని దృష్టిలో ఉంచుకొని ఈ ద్ధతి చెప్పినందువల్లే మహాత్మాగాంధీ బూర్జువా అయినారా? వారి ధర్మకర్తృత్వ సిద్ధాంతం ప్రకారం మనిషి ఉత్పత్తి చేయగల సమర్థతను ఏమాత్రం తగ్గించుకోనక్కరలేదు. కాని బ్రోగుచేసుకోరాదు. అంటే వృత్తి పరికరాల నుపయోగించి ఉత్పత్తి చేసిన సంపద అంతా సమాజానిది; మన భోగాసక్తిని పెంచుకోవడానికి కాదు ఆ సంపత్తిని సమాజానికి అప్పగించాలి.

భారతీయ పరంపర గురించిన తన పరిజ్ఞానంతో మహాత్మా గాంధీ ఈమార్గాన్ని దేశానికి చూపారు. కాని ఆమార్గంలో ఒక బాధ ఉన్నది. మనిషికి సాక్షాత్తుగా తనకేదో లాభం కన్పించనినాడు కష్టపడి పనిచేయడానికి మనిషి మనస్సు ఒప్పుకోదు. అంతగా మానవ స్వభావం చెడిపోయింది. సాంఘికంగాగాని, మరేవిధంగాగానీ మనము ఆవరించిన కుసంస్కారాలవల్ల ఈవిధంగా పరిణమించింది. దీనిని ఒప్పుకోక తప్పదు నాకు ప్రత్యక్ష లాభం లేకపోతే నేను ఎందుకు పనిచేయాలి అని మనిషి అడుగుతున్నాడు. ఇన్‌కంటాక్సును తీసుకోండి కష్టపడి పనిచేసి వంద సంపాదిస్తే, మిగిలేది రెండున్నర. మిగతాది ప్రభుత్వం తీసుకొంటుంది. ప్రభుత్వం పన్నులంతగా వసూలు చేస్తున్నది అని అనేకులు అంటున్నారు. పన్నుల విధానంలో ఆదాయం ఒకస్థాయిని చేరగానే ఈ పరిస్థితి వస్తుందంటారు. మరి యీ రెండున్నరే మిగిలేపక్షంలో అంతవరకే పనిచేయడం మంచిదని వ్యక్తి భావిస్తున్నాడు. పన్నులు లేకుండా కొద్ది శ్రమచేస్తే

రెండున్నర దొరికే పనిచేస్తే చాలు. ఇలా ఎక్కువ శ్రమను తప్పించుకుంటాడు. ఈపద్ధతిలో గల గుణదోషాల మాట అటుంచి, వ్యక్తి తన స్వంత లాభాన్ని చూచుకుంటాడనేది మాత్రం నిజం. ఒక భారతంలోనే కాదు, యావత్ ప్రపంచానుభవం కూడా ఇదే. సోవియట్ దేశంలో వ్యవసాయ భూమినంతా ఏకంచేశారు. రైతుకు వేరే భూమి అంటూ మిగిలి లేదు. రైతుకు భూమిమీద హక్కు పోయింది. వ్యవసాయం రైతుది కాదు. కొద్దిరోజుల్లోనే ఈపద్ధతివల్ల రైతులకు భూమిమీద మమకారం పోయిందని సోవియట్ అధికారులు గుర్తించారు. 'ఇది నాభూమి; దీన్నుండి ఎక్కువ పంట పండిస్తా. దీనివల్ల నాకు ఎక్కువసుఖం లభిస్తుంది' అనే మనోప్రేరణ చచ్చిపోయింది. దానివల్ల పంట దిగుబడి తగ్గింది. ఈ పరిస్థితినుండి బైటపడేందుకొక మార్గాన్ని వెదికారు. రైతులకు చిన్నచిన్న ప్లాట్లు ఇచ్చారు. ఈప్లాట్లలో ఎంత పండిస్తే అంతా మీది అన్నారు. ఈపద్ధతివల్ల, ఈ చిన్నప్లాట్లలో దిగుబడి అయ్యే పంటతో పోలిస్తే, ఆ నిష్పత్తిలో సమష్టి వ్యవసాయం వల్ల అంత దిగుబడి రావడంలేదని తేలింది.

ఇలాంటి ఉదాహరణే పశ్చిమజర్మనీది. అక్కడ విపరీతమైన ఆర్థిక సంకటం ఏర్పడింది. అర్థశాస్త్రజ్ఞులు స్వేచ్ఛా విపణిని ప్రకటించమని సలహా ఇచ్చారు. కంట్రోళ్ళు తొలగించారు. దీనితో ఆ దేశంలో ప్రగతి ఏర్పడ్డదని విశేషజ్ఞులు అంటారు. దీనితోపాటు సంపదల వికేంద్రీకరణాన్ని కూడా అమలుచేశారు. దీనితో వారి ఆర్థిక పరిస్థితి బాగుపడ్డది.

కార్మికుడికి తనకు మేలు కలుగుతుందని కన్పించకపోతే పనిచేసే స్ఫూర్తి ఉండదని పెద్దపెద్ద పారిశ్రామికులు కూడ అంటారు. కనుక ప్రత్యక్షంగా లాభం కనిపిస్తేనే మనిషి పనిచేస్తాడనేది ఆలోచించతగ్గ విషయం.

ఈ అనుభవంతో మనం సంతులనంగా ఆలోచించవచ్చు. వ్యక్తికి ప్రేరణ ఉండేవిధంగాను, దానితోపాటే సంపదల వికేంద్రీకరణం జరిగే టట్టుగాను ఆర్థిక పద్ధతిని తయారుచేయాలి. అదే ప్రగతికి మార్గం. మన పరంపర కనుకూలంగా అలాంటి మార్గమే వెదుక్కోవాలి.

## వినియోగానికి పరిమితి

ఉత్పత్తి సాధనాల విషయంలో మాత్రం ఇక యిష్టారాజ్య పద్ధతి నడవదనేది స్పష్టం. వ్యక్తి స్వాతంత్ర్యం పేరిట ఎవనికిష్టంవచ్చిన విధంగా వాడు సంపాదించడం, ఎంతైనా అనుభవించడమనేది ఇక నడ వదు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఇలా సంకీర్ణంగా అన్వయించేరోజులు పోయినాయి. మళ్ళీ ఆరోజులు వచ్చే అవకాశంలేదు. రాకూడదు కూడా. వ్యక్తి స్వాతంత్ర్యమంటేనే, స్వీయ స్వాతంత్ర్యం తనచుట్టూ ఉన్న సమాజ సోదరుల స్వాతంత్ర్యానికి కట్టుబడి ఉన్నదన్నమాట. కనుక వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఇష్టం వచ్చినట్లు వ్యాఖ్యానించే వీలులేదు. అంద రికీ ఆమోదకరంగా, హితావహంగా ఉండే మేరకే ప్రతివ్యక్తీ స్వాతం త్ర్యాన్ని అనుభవించాలి. స్వేచ్ఛాచారిగా మనసుకు తోచినట్లు విలాసాలు అనుభవిస్తానంటే చెల్లదు

మరి ఇది అమలు జరగాలంటే వ్యక్తిమీద ఏవిధమైన కట్టుబాటు ఉండాలి? దీన్నిగురించి, ఉత్పత్తి – పంపిణీ శాస్త్ర నిపుణులు ఆలోచిం చాలి. 'సంపూర్ణ సముదాయంలో ఉన్న చైతన్యం ఒక్కటే. మనిషి అంటే రెండుకాళ్ళు రెండుచేతులు గల పశువు కాదు. మనిషికి తిండి, వస్త్రం, ఇల్లు కానాల్సిందే. మరికొన్ని సౌకర్యాలు కావాలి. అయితే మానవ వికాసమార్గం సంసార భ్రమణంలో లేదు ఆధ్యాత్మికంలోనే ఉన్నది. మనిషిలో చిరంతన చైతన్యమున్నది. అతని పరిధి విలాసాను

భవాలవరకే పరిమితంకాదు. అందరిలో ఉండే ఆ చిరంతన ఆస్తిత్వంతో సమరసాన్ని సాధించినప్పుడే మనిషికి సుఖం. అదే అతని లక్ష్యం. ఆలక్ష్యసాధనలో బంధనాలు, అడ్డంకులూ ఏర్పడరాదు. ఈవిధంగా మనిషికి స్వాభావికంగా ఉండే ప్రేరణను గురించి శ్రద్ధ చూపుతూ, సంపదల వికేంద్రీకరణానికి ఏర్పాటుచేస్తూ, విలాసాలకు పరిమితి నిర్ణయిస్తూ నడిస్తేనే లాభదాయకంగా ఉంటుంది.

ఈ వ్యవస్థ ఎలా ఉంటే మేలు? ఆలోచించగా రెండు మార్గాలు కన్పిస్తాయి. ఒకట్రి-వ్యక్తి తలపెడితే ప్రయోజనముండదు. సమాజంమొత్తం తలపెట్టవలసినదీ క్షేత్రం. రెండోది- మనకు మన హిందూజీవనసిద్ధాంతాలు ఉన్నాయి. కాని వాటిని ఆచరింపచేసే పద్ధతినేడు అగమ్యంగా ఉన్నది. సంపదలను న్యాయంగా వికేంద్రీకరించే మనపూర్వపద్ధతి నేడు విచ్ఛిన్నం అయింది. అది తిరిగి వచ్చే అవకాశంలేదు. మనిషిని ప్రభుత్వయంత్రాంగంలో, చైతన్యంలేని ఒక భాగంగా గ్రహించి ఊహించే కమ్యూనిష్టు విధానమే నేటి విధానంగా కన్పిస్తున్నది. కనుక ఈ సిద్ధాంతాన్ని గ్రహించడానికి మన రాష్ట్రీయసిద్ధాంతాలను విడిచిపెట్టాలని అంటున్నారు. పైన మనం విమర్శ చేసుకున్నాం. మనిషి విలువ నిర్ణయించేటప్పుడు. సమష్టి చైతన్యంతో పరస్పర సామంజస్యాన్ని నెలకొల్పే హిందూ జీవన వైశిష్ట్యాన్ని వదలిపెడితే, ఒక రాష్ట్రంగా మన మనుగడే ఉండదు. పోగా భారతదేశం మానవత్వానికి యిచ్చిన అనుపమాన ప్రబోధాన్ని ఆచరించడమూ ఉండదు. కనుక పరిస్థితులెలా ఉన్నా, మన రాష్ట్రీయ ఆదర్శాల నుండి పతనం చెందడం తగనిపని.

ఈ నిశ్చయంతో నేడు కన్పిస్తున్న పద్ధతుల బాగోగులను పరామర్శించుకొని, మన దారిని మనం నిర్ణయించుకోవాలి.

ఈ నిశ్చయంతో ఆలోచిస్తే, పద్ధతి ఏదైనా, ఆయా పద్ధతుల సాఫల్యమనేది, దానిని నిర్వహించే కార్యకర్తలమీద ఆధారపడి ఉంటుందని గ్రహించవచ్చు. సంఘసేవకులు, ఉత్సాహవంతులు. గుణవంతులు పూనుకుంటేనే ఏపద్ధతి అయినా ఫలితాలు ఇస్తుంది. వ్యక్తులు సరిగా లేనప్పుడు ఎంత ఉత్తమ పద్ధతైనా ఫలితాలివ్వదు. కనుక వ్యక్తి నిర్మాణమనేది నిర్వివాదంగా అవసరం- ఈ పద్ధతుల గురించి జరుగుతూన్న వాదోపవాద వలయాన్ని భేదించి కన్పించే వాస్తవం ఇది.

మచ్చుకు సందదలన్నిటినీ ప్రభుత్వపరం చేయాలనే వాదాన్నే తీసుకుందాం. వ్యక్తి ఆస్తిని, సమాజ సంపదను రాజ్యానికి అప్పగించిప్రభుత్వ యంత్రాంగం ద్వారా దానిని సక్రమ పంపిణీ జరపాలని అనుకుందాం. అయితే ఈ రాజ్యతంత్రం, ఈ యంత్రాంగం ఎవరిచేతుల్లో ఉండాలి ? అనే ప్రశ్నవస్తుంది. ప్రభుత్వయంత్రాంగాన్ని నడిపే వాళ్లు ఎలా ఉన్నారు ? ఎవరో ఒకరు నడపాల్సిందే. ఈ నడిపేవాళ్లు స్వార్థులైతే గుణహీనులైతే, నిర్వహణ బాధ్యత ఇలాంటి వారి చేతుల్లో ఉంటే, రాష్ట్ర హితం కంటే, సమాజహితం కంటే, వ్యక్తి స్వార్థానికి, పార్టీస్వార్థానికి, ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తే, వ్యవహారం సక్రమంగా నడుస్తుందా ? దీనివల్ల నష్టం కలిగే అవకాశమే ఎక్కువ ఉన్నది. కనుక వ్యక్తికి శిక్షణ నివ్వందే ఏ పద్ధతీ పనిచేయదనేది తాత్పర్యం.

ప్రజలకు శిక్షణ నివ్వడం, వారెన్నుకున్న యోగ్యవ్యక్తులు రాష్ట్ర హిత కార్యకలాపాల్లో పనిచేసేటట్లు సమాజస్థితిని నిర్మించడం అన్నిపరిస్థితులలో, అన్ని పద్ధతులకూ అవసరమైనదే. లేకపోతే ఈ పనులు చేసేదెవరు ? సంఘకార్యం తప్ప, ఇంతగట్టిపట్టుదలతో ఈపని ఎవ్వరూచేయడంలేదు, ఏమైనా కొద్దిగా జరుగుతూన్నదంటే మన పద్ధతిలోనే జరుగుతున్నది. అందుకే ఈ కార్యాన్ని అతివిస్తృతంగాంవ్యాపింప చేయడానికి మనం ప్రయత్నిస్తున్నాం.

# మనిషిని నిర్మించే పని

సమాజంతో ఆత్మీయభావం, సమీప సంబంధం ఉంటేనే ప్రజలకు శిక్షణనిచ్చి, వారెన్నుకున్న గుణవంతులను రాష్ట్ర హితకరములైన పనులకు పూనుకునేట్లు చేయడానికి మనం చేస్తున్న కృషి ఫలిస్తుంది. అప్పుడే ఈ పని చేసే పాత్రత మనకు లభిస్తుంది. చిన్నదైనా పెద్దదైనా, మన శాఖ నడిచే ప్రతిచోటా ప్రజలతో మనకు సంబంధం ఏర్పడాలి. సంఘశాఖలు ఆవిధంగా ఏర్పడాలి. ఆయాస్థలాల్లో ఏవైనా ఉద్రేక పరిస్థితులు ఏర్పడితే, అందరినీ కలుపుకొని, ఆయా పరిస్థితులను అదుపు పెట్టగలంత సంబంధం సమాజంతో ఏర్పడాలి. ఇది మనము ఊహించిన సంఘ శాఖాస్వరూపం. చుట్టూ సమాజంలో వ్యాపిస్తున్న పరిస్థితుల గుర్తించగలిగే వ్యక్తులు శాఖలలో నిర్మాణం కావాలి.

అన్ని సమస్యలకు ఇలాంటి కార్యకర్తల నిర్మాణమే ఏకైక పరిష్కార మార్గమని మనకు గోచరిస్తున్నది. మంచి మనుషులను నిర్మించాలి. నలువైపులనూ పరిశీలించగలవాళ్ళను నిర్మించాలి. అందరిని వెంట తీసుకొని నడవగలవాళ్లను నిర్మించాలి. ఇది ప్రతిశాఖాక్షేత్రంలో జరుగవలసిన పని.

ఇది మాటలతో జరిగేపని కాదు. క్రమంగా విస్తరిస్తూ, త్వరత్వరగా, నగరాలలో ప్రతిభాగంలోను, జిల్లాల్లో ప్రతిగ్రామంలోను తమ సర్వశక్తిని ప్రయోగించి తమ క్షేత్ర సమస్యలను పరిష్కరించగలవాళ్ళు తయారుకావాలి. అందుకే వ్యక్తి నిర్మాణకార్యం అన్నిటికన్నా ముఖ్యమైనదని, ఎంత ఎక్కువ సంఖ్యలో కార్యకర్తలు నిర్మాణమైతే, అంత మేరకు సమస్యలు పరిష్కరింపబడుతూంటాయని మనం పదే పదే నొక్కి చెబుతున్నాం.

సిద్ధాంతాలను వల్లె వేస్తుండడమేకాని, ఆచరించకపోవడమనే దురవస్థ, వ్యక్తి నిర్మాణం చేసే శాఖా కార్యక్రమాన్ని తీవ్రతరం చేస్తే తప్పిపోతుంది. వ్యావహారికంగా ప్రజలకు మనం కొంత చెప్పగలుగుతాం. సిద్ధాంత పరాభవం జరగకుండాను, ఆచరణలో ఇబ్బందులు రాకుండాను-రెంటినీ సమన్వయించి చూపే ప్రాచీన కావ్య ప్రణాళిక మనది. ఆదే పద్ధతిని ఆర్థిక వ్యవస్థ విషయంలో కూడా స్వీకరించి, రెండురకాల అతివాద ధోరణులను విడిచి, సమన్వయమార్గాన్ని సాధించడమే లాభకరం. క్షేమకరమున్నా ప్రభుత్వ నియంతృత్వ ధోరణినీ, దానివల్ల కలుగుతూన్న చెడు ఫలితాలనూ మనం చూస్తూనే ఉన్నాం. ఈధోరణివల్ల కొందరు కలవాళ్ళు, లేమికి గురికావచ్చు. అంటే వ్యక్తిగతంగా కొందరి స్థితిగతుల్లో మార్పురావచ్చు, కాని మూలకారణం మాత్రం అలాగే ఉంటుంది. ఎందుకంటే సంపత్తీ, సాధనాలూ పూర్తిగా ప్రభుత్వపరమైతే, వ్యక్తికి పని చేయాలనే సంకల్పం చచ్చిపోతుంది. అవసరంమేరకు ఉత్పత్తి జరగదు. ధనాన్ని పంచాలనుకుంటే, ధనమంటూ ఉండాలికదా! అది లేకపోతే పంపకం ఏమిటి? నేడు దాదాపు ఇదేస్థితిలో ఉన్నాం. ఇది ఇలాగే నడిస్తే ఈచిక్కు విడదు. ఇది కాల్పనికవిషయం కాదు. రష్యా ఉదాహరణే మనముందున్నది. రష్యా చాలా విస్తీర్ణం గలదేశం. ఆ నిష్పత్తికి జనాభా చాలా తక్కువ. అతి నవీన వ్యవసాయ యంత్రాలుగల దేశం. నదులకు కొదవలేదు. ఇన్ని ఉన్నా, వారికి ఆహారపదార్థాల కొరత ఉన్నది. విదేశాలనుండి ఆహారపదార్థాలను దిగుమతి చేసుకుంటున్నారు. కనుక ప్రభుత్వానికే అన్నీ వశపరచాలనే ధోరణి ప్రయోజనకారి కాదు. వ్యక్తి ఆస్థిని రద్దుపరిస్తేనూ లాభంలేదు. అట్లాగే కేవలం తానూ, తన కుటుంబమనే పరిధివరకే ఆలోచించడంకూడా పొరపాటే. ప్రతివ్యక్తీ తన స్వార్థపూర్తికీ విలాసాలు అనుభవించే కోరికతో మాత్రమే పనిచేయడం అంటే కూడా పొరపాటే. ఈరెండు వ్యతిరేక ధృవాలను వదలి, నవీనమైన, మౌలికమైన మార్గాన్ని వెదకాలి. ఈరెండు తీవ్రవాదాల మధ్య సామరస్యాన్ని

సాధించాలి. వ్యక్తికి తనకూ, తన కుటుంబానికీ సంబంధించిన బాధ్యతలను నిర్వహించే సమస్య ఉన్నది. కనుక అతనికి పరిమితమైన రూపంలో ఆస్తిహక్కు ఉండడం అవసరం. దీనితోపాటు బాధ్యతా నిర్వహణకు సమర్థమైన వ్యక్తిగత యజమాన్యపు పరిమితి అతిక్రమించబడకుండా అతనిపై కొంత అదుపుకూడా ఉంచవలసి ఉంటుంది. పరిమితమైన రూపంలో వ్యక్తిగత ఆస్తి పరిమితమైన వ్యక్తిగత ఆదాయం – వీనితో పాటు మానవ స్వభావాన్ని దృష్టిలో ఉంచుకొని భౌతిక సుఖానుభవానికి పరిమితమైన అవకాశం ఉండే వ్యవస్థను ఏర్పరచి, సమాజంలోని సామాన్య ప్రజల అవసరాలను తీర్చడంలో దాని పాత్రనుకూడా నిర్ణయించే మార్గాన్ని అవలంబించవలసి ఉంది.

పైన చెప్పినట్లు, పద్ధతి ఏదైనా, దాన్ని నిర్వహించాలంటే మంచి మనుషులు కావాలి. సమాజంమీద మమకారం, దయా, సమాజ దుఃఖానికి దుఃఖించే గుణం, స్వార్థాన్ని నిగ్రహించుకోగలశక్తి, ఈశక్తితో శరీరబాధల నెదిరిస్తూ సమాజంకొరకు మంచిపనులు చేయగల ఓర్మి – ఈ గుణాలు గల వ్యక్తులను నిర్మించాలి ఇలాంటి గుణవంతుల శక్తులన్నీ, సంపూర్ణ రాష్ట్ర శ్రేయస్సుకు అవసరాన్నిబట్టి, సక్రమంగా ఉపయోగ పడేట్లు చేయడానికి అనుశాసనం నేర్పే ఏర్పాటు ఉండాలి. ఈవిధమైన కార్యకర్తలను నిర్మించే మౌలిక కార్యాన్నే మనం సంఘశాఖల్లో చేస్తున్నాం. వ్యక్తులమధ్య ఎంత సమన్వయం ఉంటే, అంతగా ప్రగతిపథాన పురోగమించవచ్చు. దీనికి కాలం పడుతుందనేది నిజమే. అయితే తాత్కాలికంగా ఏదో కఠినచర్య తీసుకుంటే ప్రయోజనం లేదు. మనుష్యులు అంతఃప్రేరణతో ఇట్టి పనులకు పూనుకునేటట్లు చేసేపని ఇది. ఇలాంటి వారు ప్రతిచోటా, ఎప్పుడూ సిద్ధంగా ఉండేటట్లు నిర్మించడానికి మనం నిత్యశాఖాకార్యం ద్వారా కృషిచేస్తున్నాం. ఆలోచనలు గొప్పవికావచ్చు;

విశాలమైనవి కావచ్చు; ఆచరించవాళ్ళు లేకపోతే లాభంలేదు. ఈనిష్కర్ష ననుసరించి సమాజ సంఘటన కార్యం అంటే రాష్ట్ర ప్రగతికి పునాదిగా ఉండగల చక్కని, శక్తిగల కార్యకర్తల నిర్మించడమేనని తాత్పర్యం.

# ఆత్మ విశ్వాసం

రాష్ట్ర సంఘటన అనే ఈ పవిత్ర లక్ష్యం, మనదేశ వాసులందరిలో సమానంగా, చిరంతన మాతృభక్తిని నింపి, రాష్ట్ర మాలికలో గ్రుచ్చ డానికి జరుగుతూన్న ఈ మహాకార్యం, చాలాజటిలమైనది. ఎందుకంటే మనం సంఘటితం చేయదలచుకున్న మన సోదరులు అనేక నిమిత్తాలుగా, ఒకరికొకరు దూరంగా, వేర్వేరుగా అనైక్యంగా ఉన్నారు. అలాంటి వారిలోంచి అక్కరకు వచ్చేవారిని ఒక్కొక్కరినే ఎన్నుకోవాలి; ప్రేమా దరాలతో వారు సమాజబాధ్యత తీసుకునేటట్లు ప్రేరేపించాలి; అలా సమీక రించిన వారికి, వారివారి యోగ్యతలను గుర్తించి, సంఘటనానుకూలమైన పనిని అప్పగించాలి; వారందరూ ఏకసూత్రంతో, అనుశాసనంగా మెలిగే టట్లు నిరంతరం మెలకువతో ఉండాలి - ఇది సరళమైన కార్యం కాదు.

ఐనా పనిమీద ఆత్మవిశ్వాసం ఉన్న వ్యక్తి ప్రపంచం ఒక్కటై ఎదిరించినా, ప్రక్కకు నెట్టి విజయాన్ని సాధిస్తాడు. పనిజరగదా. నేను చేస్తా, గెలుస్తానని నిటారుగా నిలుస్తాడు. అలా నిల్చున్నవాడు, అతనిలోని పరమేశ్వరుడు పలుకుతాడు. అతనికి విజయం లభిస్తుంది. ఈ ధైర్యంతో కట్టిబద్ధులం కావాలని నా కోరిక.

మన యీ సమాజ కళ్యాణంలో, ఈ సమాజాన్ని సంస్కార యుతంగా చేయడంలో, ఈధర్మరక్షణలో సమస్తమానవ కళ్యాణం నిండి

ఉన్నదని మన విశ్వాసం-ఈ విషయాలను సాధించడానికై సంఘకార్యం యొక్క బాహ్యరూపమైన శాఖను బలపరచడానికి మనం ప్రయత్నించాలి.

కార్యం రెండు విధాలు- ఒకటి నిత్యశాఖ. ఇరవైనాల్గుగంటలు మనం చేసిన పనిని సమీక్షించు కొని సరిచూచుకునే స్థానం- సంఘస్థానం. బుజాలు బుజాలు రాసుకుంటూ, అనుశాసనం నేర్చుకుంటూ, సమస్త సమాజం పట్ల అభేదభావాన్ని నిర్మించే స్థానం సంఘస్థానం. ప్రతినిత్యా ప్రార్థనతో, ధ్వజ దర్శనంతో మనధ్యేయాన్ని కట్టెదుట నిల్పుకొని స్మరించుకొనే అవకాశం లభించేస్థానం – సంఘస్థానం,

నిత్యశాఖలో మనరాష్ట్రాన్ని ఉదాత్తంగా నిర్మించాలనే సంకల్పానికి పదును పెట్టుకుంటాము. 'పరం వైభవం నేతు మేతత్స్వరాష్ట్రం' అని అని మనరాష్ట్రాన్ని పరమవైభవ సంపన్నంగా చేసేందుకు మనం తల పెట్టిన నిశ్చయాన్ని ప్రకటిస్తాం. రాష్ట్రం పరమవైభవంగా ఉండడమంటే ధన సంపదలు, ప్రభుత్వమూ మొదలగు వాటితో తృప్తిపడడంకాదు; ఆయా ప్రగతి సంపదలు ధర్మానుకూలంగా ఉండాలి ఇదేరాష్ట్రీయదృక్పథం. ఇవన్నీ ధర్మ రక్షణకు ఉపయోగపడాలి. ధర్మరక్షణ అంటే ధర్మాచరణే. అందుకే 'విధాయాస్య ధర్మస్య సంరక్షణమ్' అని ప్రార్థనలో అనేది. ధర్మ రక్షణ మొదటిది. అంటే ధర్మాన్ని ఆచరిస్తూ పరమవైభవాన్ని కోరుతాం. ధర్మం లేని స్వాతంత్ర్యం, వైభవం అర్థంలేనిది. ఎన్నివైభ వాలు సంపాదించడానికైనా ఇది మొదటి షరతు.

ధర్మ శబ్దం వాడుకలో చాలా చిక్కులు తెస్తున్న మాట నిజమే. ఎందుకంటే, ధర్మం చాలా వ్యాపకమైన శబ్దం. అందులో అనేక అర్థాలు ఉన్నాయి దాంతోపాటు తెలిసీ తెలియని అపోహలు కూడా ఉన్నాయి ఈ అపోహలతో సామాన్యుడు ధర్మశబ్దవ్యాఖ్యము గ్రహించలేకపో న్నాడు. మన ప్రాచీనులు ఈ ధర్మశబ్దాన్ని అనేకంగా వ్యాఖ్యానించా

అయినా అన్ని వ్యాఖ్యలూ పరస్పరాను గుణములే. వాటిలో ఎక్కువగా ఆమోదింపబడుతూన్నది, వాడుకలో ఉన్నది 'యతః అభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః సధర్మః' అనేది. ఈ వ్యాఖ్య మన ప్రార్థనలో 'సముత్కర్షనిశ్శ్రేయసస్య' అన్న పదంలో వచ్చింది. అంటే ధర్మం ద్వారా అర్థకామాలన్న మాట (ధర్మాత్ అర్థశ్చ కామాశ్చ) ఈ ధర్మాచరణకు చివరికి లభించే ఉత్తమమైన పూర్ణమైన ఫలితం నిశ్శ్రేయస్సు. ఈ సారాంశం మన ప్రార్థనలో ఉన్నది. రాష్ట్రవైభవాన్ని గురించిన ఈ సంపూర్ణజీవన చిత్రాన్ని మన దృష్టిలో ఉంచుకోడానికి నిత్యప్రార్థనలో పాల్గొనడం చాలా అవసరం.

## మననుండే ప్రారంభం

మనకు మిగిలే సమయంలో, మనచుట్టూ నివసిస్తూన్న సమాజ సోదరు దగ్గరకు పోవడానికి, వారిలోంచి వ్యక్తులను ఏరుకొని, వారిని మనవెంట నడిపించడానికి ప్రయత్నించడానికి కృషిచేయడం – ఈ శాఖా కార్యక్రమంలో రెండవభాగం. జనంతో చాలా దగ్గర సంబంధాలు ఏర్పరచుకుంటూ, ఈ స్నేహపూర్ణమైన వాతావరణాన్ని నల్దిశలా వ్యాపింపచేసే మన యీ ప్రయత్నం ఆగకుండా జరుగుతూ ఉండాలి. మనం ఇలా ప్రయత్నిస్తే కొద్దిరోజులలోనే అవసరమైనంతమేరకు మనం ఒక పవిత్రమైన శక్తిగా నిల్చోగలమని నాభావం. మనదేశం కొరకు, రాష్ట్రంకొరకు, సమాజంకొరకు ఇది చాలా అవసరం.

సమయం దొరకడంలేదంటే లాభంలేదు. ఇది అవసరమైన కార్యమని గుర్తించి, సరిగా పనిచేస్తే తగినంత సమయం తప్పక లభిస్తుంది. మనచుట్టూ విశాలమైన సమాజం ఉన్నది. మరి మనకు సమయం దొరకదనడం మంచిదికాదు.

నిత్యజీవనంలో మన మేపని చేస్తున్నా సమాజంతో సంబంధం ఏర్పడుతూనే ఉంటుంది. ఈపనులు చేసేటప్పుడు సంఘకార్యాన్ని గుర్తుంచుకోవాలి. డాక్టర్ల దగ్గరకు రోగులు వస్తుంటారు. ఉపాధ్యాయుల చుట్టు విద్యార్థులుంటారు రైతులైనా, తోటపనివారైనా రకరకాల వ్యక్తులు చేరుతుంటారు. విద్యార్థులకు, ఆటపాటల స్నేహితులు, కలిసి మెలిసి తిరిగేవారుంటారు. వ్యాపారులదగ్గరకు కొనుగోలుదారులు వస్తారు, వీరందరితో మాట్లాడుతూనే ఉండాలి. ఆత్మీయత పెంచుకోవాలి. ఇది చేస్తూ, సమాజకార్యంలో వారి సహకారంవల్ల లభించగల ఉపయోగాన్ని గురించి ఆలోచిస్తుండాలి. ఆయావ్యక్తుల గుణాలను గ్రహించి వానిని సమాజానికై ఉపయోగించే ప్రేరణ యివ్వాలి వ్యక్తిచేసే ప్రతిపనిలో ఏదో ఒకరకమైన రాష్ట్రహిత భావన మెదలుతూనే ఉండాలి. అంతేకాదు. మనం దుర్గుణాలనుకుంటున్నవాటిని కూడా రాష్ట్రంకొరకు ప్రయోగించే కళను అభ్యసించాలి. తోటివారిని దోచుకొని, ఆకలికి మాడ్చిచంపడం ఆనందహేతువు కాదని దొంగలూ, దోపిడీదారులూ గుర్తించవచ్చు. అదే చేయదలచుకుంటే మన రాష్ట్ర శత్రువుల రహస్యాలను వెలికి తీసుకొని రావాలి. ఈ దుర్గుణాలను కూడా రాష్ట్ర శ్రేయస్సుకై వినియోగించాలి. ఇరవైనాలుగు గంటలు ఇదే ధ్యాస ఉంటే, మన నిత్య వ్యవహారంలో మనతో సంబంధం గలిగే వారందరిలో రాష్ట్ర భావాన్ని ప్రేరేపించాలనే ధ్యాస ఉంటే 'టైం లేదు' అనే అవకాశం ఉండదు.

ఇట్లా మొత్తం సమాజ క్షేమమే తమ స్వార్థమనుకుంటూ మరో స్వార్థం పెట్టుకోకుండా, కీర్తి ప్రతిష్ఠలు, సన్మాన గౌరవాలు పొందలనే అభిలాషను పూర్తిగా వదలుకున్నవాళ్ళు, సమాజం పొందే గౌరవాదరాలకు పొంగి పోయేవాళ్ళు అనేకంగా తయారు కావాలి. సమాజం సహజమైన ఆదరాభిమానాలు వీరిపట్ల ప్రదర్శించాలి. వీరివలె తయారు కావాలనే కోరిక జన్మింపచేసేట్లుండాలి. వీరేమిచేసినా మేలుకేననే భావన

సమాజాని కుండేటట్లు, అవసరమైతే సమాజానికి మార్గదర్శనం చేయగల రనే విశ్వాసం కలిగేటట్లు, వీరు నిర్మాణం కావాలి. గుణసంపన్నులు, పవిత్రులు, ధర్మనిష్ఠులు, సమాజహితానికి మురిసిపోయేవాళ్ళు ఎక్కువగా నిర్మాణం కావాలి. దీనితోపాటు, వీరిని సూత్రబద్ధంగా కూర్చి, సంపూర్ణ సమాజాన్ని ఆలింగనం చేసుకోగల్గి, సర్వసమాజకళ్యాణానికి పూర్తిగా అంకితమై పనిచేయగలవారు కావాలి. ఇలాంటి మహనీయ దృశ్యాన్ని సాధించాలి. ఆపైన సంఘాన్ని గురించి ఎక్కువ ఏమీ చెప్పనక్కరలేదు.

దీనికై మందికి ఉపదేశం ఇవ్వనవసరంలేదు. మననుండే ప్రారంభం కావాలి. ఇదే మన కార్యక్రమంయొక్క రెండోరూపం మన సంస్కారాలను ముందు బాగుపరచుకోవాలి. మిగతా సమాజంతో తాదాత్మ్యభావం పొందగలిగేంత సుగుణం మనలో వికసించాలి. ప్రతి ఒకని సుఖం మనకు సుఖాన్నివ్వగల ఓర్మి అలవడాలి. పరుల సుఖాలకు ఆనందించి, దైన్యానికి కరగి, ఆదైన్యాన్ని తొలగించడానికి వ్యక్తిగా, సామూహికంగా పద్ధతితో ప్రయత్నించగలిగే సంసిద్ధత ఉండాలి. ఇలాంటి నిర్మలభావాన్ని మనలో నింపుకోవాలి. జీవనంలో ప్రవేశింపచూచే బలహీనతలను, వికారాలను తొలగించుకోడానికి ఎంత కఠినంగానైనా ప్రయత్నించాలి. ఇదే సంఘకార్యంయొక్క అంతఃస్వరూపం. ఈ స్వరూపం అర్థమైతే చెప్పవలసింది లేదు. రాష్ట్ర చైతన్యాన్ని, పవిత్ర రాష్ట్రశక్తిని, అన్నివిధాల దుఃఖాలనుండి రాష్ట్రాన్ని రక్షించగల సామర్థ్యాన్ని నిర్మించే కార్యమిది. ప్రతిఘడియా మనలోపలికి తొంగి చూచుకుంటూ, మన సంస్కారాలను పునీతంగా, శుద్ధంగా, ఉంచుకుంటూ, చాలా ప్రయత్నంతో మన గుణశీలాల ప్రభావాన్ని విస్తరింపచేసుకోవాలి

మన సమాజం సువిశాలమైంది. మనలో ఎన్నో కులాలుఉన్నాయి. ఈ కులాలు వేటికవేనని లోకం అంటుంది. అంటే అననీయండి. మన

కన్నిటా ఉత్తములు, కర్తవ్యపరాయణులు, పవిత్రులూ, శుద్ధ గుణ సంప న్నులూ లభిస్తారు. వనవాసీ క్షేత్రాలలో నడుస్తూన్న మన కార్యక్రమానికి వనవాసీలనబడే సోదరులు కొందరు లభించారు. వారిని చూచి పట్టణాలలో ఉండే నాగరికులమని చెప్పుకునే వారు సిగ్గుపడాలి. ప్రయత్నమే జరిగితే ప్రతికులంలో ప్రతిగ్రామంలో, నగరంలో మనకు ఇలాంటి ఉత్తమసోదరు లెందరో లభిస్తారు. ఇలాంటివారిని ఏర్చికూర్చి, రాష్ట్రహితానికై అంకిత మైన ఒక దివ్యశక్తిగా నిర్మాణం చేయాలి.

అంకితమైన శక్తి అంటే మనకు రాష్ట్రహితం మినహా మరొకటి అక్కర లేదని నాభావం. ప్రభుత్వం, గౌరవ ఆదరాలు, మొదలగు కోరిక లేమీలేవని తాత్పర్యం. రాష్ట్రశక్తిని పవిత్రంగా ఉపాసించే వాళ్ళం మనం. ఈ పవిత్రశక్తిని నిర్మించి ఉంచే వాళ్ళం. దీని కొరకు మన మేదో గొప్ప వాళ్ళమనే గర్వాన్ని దరిజేరనీయకుండా రాత్రిందివస్సు పనిచేస్తూ ఉండాలి.

## ప్రచారకులు కావాలి

ఈ పనిని దేశమంతటా వ్యాపింపచేయాలి. దీనికై ప్రచారకులన బడే కార్యకర్తలు కావాలి. కావలసినంతమంది. ప్రచారకులు సునాయాసంగా లభిస్తారా ? అంత తేలికగా దొరుకుతారనుకోను. మొదట్లో శ్రమలేకుండా లభించి ఉండవచ్చు. సంఘంలో చాలామంది పాత కార్యకర్తలున్నారు. స్వీయకుటుంబ జీవనం అంటూ ఏమీలేకుండా పూర్తిగా సంఘకార్యంలో లీనమై ఉన్నారు. వీరికొరకు ఆనాడు పెద్దగా ఏదో ప్రయత్నం జరిగిందని అనలేము. అలాసహజంగా వచ్చారు. నేడు పరిస్థితులు మారినాయి. నేడు అంత సహజంగా రావడం కష్టం. నేడు ప్రచారకులు తయారుకావాలంటే ఎక్కువ శ్రమించాలి. ఒక్కొక్కరుగా విషయాలన్నీ వివరించాలి. పరిస్థి

తుల అంతర్యాలను గుర్తింపచేస్తూ నిర్మాణం చేయాలి. ఈ రాష్ట్రప్రగతి కార్యంలో రాగల సాధక బాధకాలను చక్కగా తెల్పాలి. జీవితంలో ఆకర్షణక్షణాలు తటస్థిస్తాయి, ఆపదలు వస్తాయి. దెబ్బలు తగులుతాయి. వాటిని సహించి గట్టెక్కాలి. సన్మానాలు పొందాలనే కోరికలు తీవ్రంగా పుడతాయి. వాటిని ప్రయత్న పూర్వకంగా అణచుకోవాలి, గౌరవప్రతిష్ఠలు- నేడు నాయకత్వపు మోజు అనేది-ఆశలు పురికొల్పుతాయి, వాటినుండితప్పు కోవాలి. ఇన్ని బాధలను భరించి ఈపనిచేయాలి ఈ పనికై మనఆవాహన ప్రతి ఎదనూ ప్రతిధ్వనింపచేయాలి.

ఎందుకంటే ఈ కార్యం చాలా విస్తారమైనది. దీంతోపాటు ఆయా వివిధక్షేత్రాలు కార్యకర్తలు కావాలంటున్నాయి వ్యక్తులు కావాలంటారు ప్రతిచోటా ప్రతిరంగం కార్తకర్తలు. కనుక ఇంత పెద్ద అవసరాన్ని తీర్చేందుకు కార్యకర్తలను నిర్మాణం చేసే ఒక వర్గాన్ని నిర్మించాల్సిన అవసరం చాలా ఉన్నది. ఇదాలోచించి జాగ్రత్తపడాలి.

సంఘకార్యంలో, మన శాఖాపద్ధతిలో అనేకభాగాలున్నాయి, స్వయం సేవక సోదరుల శారీరక మానసిక ప్రగతికి క్రమబద్ధంగా కార్యక్రమాలు ఏర్పడతాయి, దాన్ననుసరించి కార్యక్రమాలు పంచుకుంటాం. ఈ వివిధ కార్యక్రమాలతో పాటు ప్రచారక నిర్మాణ కార్యంకూడా ఒక భాగంకావాలి. దీనికై అధికారులు నిశ్చయింపబడాలి. తన జీవనంలో త్యాగాన్నిఆదర్శంగా పెట్టుకొని, తన క్షేత్రంలో అందరితోనూ ఘనిష్ఠ సంబంధం ఏర్పరచు కోవాలి. తన క్షేత్రంలో కార్యకర్తలను ఏది, ''మీ సమయాన్ని పూర్తిగా సంఘాని కివ్వం''డన గలిగేంత ఘనిష్టంగా ఆ సంబంధం ఉండాలి. మిగతా సంగతులు మరచిపొమ్మని చెప్పగలిగి ఉండాలి. దీనికై ఎంత తిరగాల్సి ఉంటే అంతగా తిరగాలి, సమయం ఇవ్వాలి. శ్రమపడాలి. కార్యకర్తలను నిర్మించాలి. ఇది చాలా మహత్వకరమగుకార్యం.

సమాజ సేవకొరకు సంఘంలో ఉన్న ప్రచారక వ్యవస్థ లాంటిది మరెక్కడా కన్పించదు. ఈ అసాధారణ పద్ధతి మనకు ఉన్నది దీని టెక్నిక్ ఎవరికీ తెలియదు పరమేశ్వరుని దయవల్ల ఇది నడుస్తున్నది. కాని ముందుగా మనిషి కొంచెమైనా పనిచేసి నప్పుడే దైవం తోడ్పడేది. అందుకే నేను, 'ధ్యాసతో, వ్యక్తులను ఏరి, యీ అనన్యమైన ప్రచారకపద్ధతిలోనికి ప్రవేశింపచేయడానికి ప్రయత్నం జరుగుతున్నదా ?' అని ప్రశ్నించాను. ఇది జరగాలి సమాజంలో నలువైపులా విస్తృతంగా ఈ ఉత్తమ వర్గం మన కార్యక్రమంలో నిర్మాణమయినారు. వీరిని గురించి శ్రద్ధ తీసుకోవాలి. విశాలంగా సంపర్కంలోకి వచ్చి ఈ క్షేత్రంలో పనిచేస్తున్న వ్యక్తుల జ్ఞాన, శ్రద్ధా, శీల, సాహసాలను సంరక్షించవలసిన అవసరంకూడాఉన్నది. సమాజంలో వివిధ క్షేత్రాలలో పని చేస్తూన్న ఈ కార్యకర్తలలో పరస్పరం సమన్వయాన్ని చేకూర్చడానికి, ఉత్సాహమిస్తూ ఉండడానికి ప్రచారకులు ఆయాక్షేత్రాలలో ఉండవలసిన అవసరం చాలా ఉన్నది. అందుకే ఇలా పని చేయాలన్ని కోరికను మనసులో రగులు కొలిపే ఉత్సాహాన్ని కల్గించాలనే ఉద్దేశంతోటే, పద్ధతితో ఈ పని జరుగుతున్నదా అని అడగవలసి వస్తున్నది.

మరో విషయాన్నికూడా మరువరాదు ఈ ప్రచారకులనే పేరుతో ఒక కొత్త జాతిని, వర్గాన్ని మనం నిర్మాణం చేయదలచలేదు. మిగతా కార్యకర్తలకన్నా ప్రచారకులు కొంత భిన్నులు అనేభావన మనస్స్ఫురించరాదు

మనమందరమూ కార్యకర్తలమే. కాని అవసరాన్నిబట్టి సంఘ కార్యం మినహా మరోపని చేయకుండా, ఉన్న సమయాన్ని, శక్తిని, బుద్ధిని, భావాన్ని పూర్తి సంఘానికే ఉపయోగిస్తూ, యితరమేమీ ఆలో

చించే అభిలాషలేకుండా, ఏకాగ్రచిత్తంతో, అటూ ఇటూ మన సంఘకార్యానికై పరుగులు తీసే ప్రచారక కార్యకర్తలు చాలా పెద్దసంఖ్యలో కావాలి.

వీరితో సహకరించడానికి ఆయాస్థానాలలో మన అధికారులున్నారు. సంఘచాలకులు, కార్యవాహకులు, శిక్షకులు గుణాలకు ప్రచారకులకు తీసిపోరు ఇంటిపనులు చూచుకుంటూ రేయింబవళ్ళు సంఘకార్య విస్తారానికి వీరు ప్రయత్నిస్తుంటారు. వీరు ఇలా పనిచేస్తూ, నూతన ప్రదేశాలకు వెళ్ళేందుకు ప్రచారకులకు సమయాన్ని మిగులుస్తుంటారు.

ఈపని త్వరలో పూర్తిచేయాలని మనం అంటూ ఉంటాం. దీనికై కార్యకర్తల నిర్మాణానికి, వికాసానికి శ్రద్ధ చూపాలి నిర్దోషులు, గుణవంతులు, ధ్యేయనిష్ఠకలవారు, కర్మఠులు, మంచి యోగ్యతతో పనిచేయగలవారు మనకు ప్రతిచోట లభిస్తారు ఏదో ఒక ప్రత్యేకవర్గంలో లభిస్తారనేది ఏమీలేదు. ప్రతిచోటా దొరుకుతారు దేశమంతటా వారికై వెదకాలి వెదికి పనిలో వారిని ప్రవేశింపచేయాలి వ్యక్తిగత జీవితంలో నిగ్రహాన్ని అలవరచుకొని, సంఘకార్యానికై ఎక్కువగా వెతికి తెచ్చి, చాలా పెద్దసంఖ్యలో ఈపనిలో ప్రవేశింపచేయాలి. సమాజంలో ఈవిధమైన శ్రేష్ఠ గుణ సంపన్నులు, త్యాగులు, ఈ మహాత్కార్యానికి సర్వశక్తినీ కేంద్రీకరించేవారు నిర్మాణం కాకపోతే, మిగతా లక్ష చెప్పినా లాభంలేదు. ఈ విషయాన్ని మనం అందరం ఆలోచించాలి.